ఆగస్టు
1948

# చందమామ

ఖరీదు
0-6-0

పిల్లల కథల మాసపత్రిక




CHANDAMAMA : CHILDREN'S STORY MONTHLY






స్వరాజ్య రథము

# భూమినుండి సంపద — ఇనుము



ప్రకృతి యొసగిన పదార్థములలో నేలబొగ్గు, ప్రత్తి తరువాత ఇనుమే చాల ప్రధానమైనది. కారణ మేమంటే, రైలుఇంజను మొదలు గుండుసూది వరకు మనము ఉపయోగించే వస్తువులన్నిటికి ఇనుమే ఆధారము.

ప్రక్కనున్న పటము ఇనుము దొరకు ప్రధానప్రదేశములను సూచించును. ఇనుము నుండియే ఉక్కు లభించును. పరిశ్రమల నభివృద్ధిచేయుటకు, రోడ్లను, రైలుమార్గములను వేయుటకు, గృహముల నిర్మించుటకు, మనందరకు అవసరమగు వస్తువులను, తయారుచేయుటకు ఇండియాలో ఇనుము, ఉక్కు అవుసరము. మన దేశమందలి వీటియొక్క ఉత్పత్తి 30 లక్షల టన్నులు; కాని ఇది ప్రపంచపు ఉత్పత్తిలో 1.9% మాత్రమే.



3000 సంవత్సరముల క్రిందట వేట ఆయుధములు, గృహపరికరములు, వ్యవసాయపు పనిముట్లను తయారు చేయుటకు ఇనుము మొదటిసారి ఉపయోగించబడినది. 24 అడుగుల యెత్తుగల యినుపస్తంభమగు కుతుబ్‌మీనార్ ఢిల్లీలో 1000 సంవత్సరముల క్రిందట నిర్మింపబడెను. దీని పనితనము చాల శ్రేష్ఠమైనది. అందుచే అది ప్రపంచమందలి విచిత్రములలో ఒకటిగా లెక్కింపబడినది.

జెంషెడ్పూర్ వద్దనున్న టాటా ఐరన్ & స్టీల్‌కంపెనీ, ఇండియాలో ఉక్కు తయారుచేయు ప్రధాన కర్మాగారము. నేడు ఇది ప్రపంచమందలి పెద్ద కర్మాగారములలో నొకటిగా పరిగణింపబడినది. ఈపరిశ్రమ ననుసరించి అనేకఉపపరిశ్రమలు జెంషెడ్పూర్‌వద్ద బయలుదేరినవి. ఉదా: కిరసనాయిలు మొదలు సిగరెట్లు,బిస్కెట్లు వరకూ రవాణాచేయుటకు డబ్బాలు చేయుట; అన్నిరకాల తీగెతయార్లు, మేకులు, వ్యవసాయపు పనిముట్లు; ఇవేగాక రైలు ఇంజన్ల తయారుకూడా.

మరుసటి సంచికలో మరియొకదానికై
వేచియుండుడు. ఈ వరుసను మీ టాంకో
స్క్రేప్ పుస్తకంలో పోగు చేయుడు.




ప్రకటనదారులు : హమాం & 501 సబ్బులను తయారు చేయు

## ది టాటా ఆయిల్‌మిల్స్ కంపెనీ లిమిటెడ్

# JAMES POMADE




## జేమ్స్ పొమేడ్

★

ముఖానికి చల్లదనమును కలిగించి, సౌందర్యమును వృద్ధిచేయును.



## డోంగ్రేగారి బాలామృతం

బలహీనమైన బిడ్డలకు పుష్టియున్ను, పండ్లు మొలిచేటప్పుడు అయ్యే విరోచనములు నిలిపి, బలమును, ఆరోగ్యము నిచ్చును.

K. T. Dongre & Co. BOMBAY-4

## ఏజంట్లు కావాలి

★

"చందమామ"కు ప్రతి వూరా చిన్న చిన్న ఏజంట్లు కావాలి. మీరు ఏజంటయి కొద్ది కాపీలు కూడా తెప్పించుకోవచ్చును. మీరు ప్రతినెలా 2-0-0 పంపుతూ వుంటే మీకు 7 కాపీలు పంపుతాము. ఈ పద్ధతిన మీకు ప్రతినెలా 0-10-0 లాభం వుంటుంది. పూర్తి వివరాలకు మాకు వ్రాయండి.

**చందమామ ఆఫీసు,**

పోస్టుబాక్సు నెం. 1686, మద్రాసు-1.

## చందమామ

ఈ సంచికలో యివి

చదువుకోండి



ఇవన్నీగాక చిక్కుచదరాలు, ముగ్గులు, చిక్కు బొమ్మలు, పొడుపు పద్యాలు, పజిలు, ఇంకా, ఇంకా ఎన్నో వున్నై.

చందమామ ఆఫీసు
పోస్టుబాక్సు నెంబరు . 1686
మద్రాసు . 1.




సంచాలకుడు: చక్రపాణి

సంపుటి 3 | ఆగస్టు 1948 | సంచిక 2

# పెద్ద పండుగ

పాపలూ! మనకు ఎన్నో పండుగ లున్నై. సంవత్సరాది, సంక్రాంతి, దసరా, దీపావళి, శివరాత్రి క్రిస్మసూ, రంజానూ మొదలైనవి. కాని, ఇవి మన దేశంలోని ప్రజ లందరికీ పండుగలు కావు. కొన్ని మతాలవారికీ, కొన్ని జాతులవారికీ మాత్రమే పండుగలు. అయితే, మన దేశంలో ఉండే అన్ని మతాలవారూ, జాతులవారూ కలిసి చేసుకునే పండుగ ఒకటైనా లేదా ? అంటారేమో! ఉంది. అదే మన స్వాతంత్ర్యదినం! మన పెద్ద పండుగ!

క్రిందటి సంవత్సరం ఆగస్టు 15 వ తేదీన మనం స్వాతం త్రులమైనాము. ఆనాడు దేశమంతటా పెద్ద ఉత్సవాలు చేసుకున్నాము. తిరిగి ఆగస్టు 15 వ తేదీ రాబోతున్నది. మళ్లీ ఆనాడు బ్రహ్మాండమైన ఉత్సవాలు చేసుకుంటాము.

అయితే, మీరీ పండుగ ఉత్సాహంలో వెనుక మీ పెద్దలు పడ్డ కష్టాలమాట మరిచిపోతారేమో! అది సహజం కూడా. కాని, మీ రొక్కమాటు మీ నాన్ననైనా, తాతయ్యనైనా అడిగి చూడండి-వారు చెప్పుతారు, తాము పడ్డ కష్టాలు.

పాపాయిలూ! మనం ఈ పండుగ సందర్భంలో మన స్వాతంత్ర్యంకోసం ప్రాణాలుధారవోసిన లోకమాన్య తిలక్, మహాత్మా గాంధీ మొదలైన వారి దివ్యనామాలు స్మరించుకోవాలి. వారు మన దేశానికిచేసిన సేవలో నూరో వంతైనా మనం చేయాలని సంకల్పించుకోవాలి. అప్పుడే మనం నిజంగా భారతీయుల మనిపించుకుంటాము.

ఈ నాడు మనం స్వతంత్రులం. మనది స్వతంత్ర ప్రభుత్వం. మన ప్రభుత్వాన్ని నడుపుతున్నది ప్రధాని పండిత జవహర్‌లాల్ నెహ్రూ. ఉపప్రధాని సర్దార్ వల్లభ భాయి పటేల్. వీ రిద్దరి సారధ్యంక్రింద మనప్రభుత్వరథం కదిలిపోతున్నది. ఆ రథాన్ని మనమందరం కలిసిలాగాలి. మనం తలా వొకదోవకు లాగితే వారు రథాన్ని సరిగా నడప లేరు! రండి. మన మందరం కలిసి ఒకేమార్గాన లాగుదాం.



# తెలివి తక్కువ పులి

అనగా అనగా ఒక వూరు. ఆ వూళ్లో ఒక రైతు వున్నాడు. అతను ఒకరోజున తన ఎద్దులను తోలుకుపోయి పొలము దున్నుకొంటూ వుండగా ఒక పులివచ్చి, అతన్ని మర్యాదచేసి "అంతా క్షేమమా ?" అని కుశల ప్రశ్నల వేసింది.

ఆరైతు దైవకృపవల్ల తను క్షేమమేనని చెప్పాడు. పులి మళ్లీ యిలాఅంది: "నీవు క్షేమంగావున్నందుకు నాకుచాలాసంతోషం. ఇప్పుడు నీ రెండు ఎద్దులను తినమని దేవుడు నన్ను పంపాడు. దేవుడు ఎలా చెబితే అలా నీవుచేస్తావుగనక, నీ ఎద్దులను రెంటిని విప్పి నాకు ఆ హారంగా యివ్వు."

పులి యిలా అనేసరికి కాపుకు తగని భయమేసింది. ఏమి చెయ్యటమా అని ఆలోచించసాగాడు. అలా ఆలోచించగా కాపుకుఒకఆలోచనతట్టింది. "పులిమామా! నీవు చెప్పింది ఏమాత్రమూ న్యాయం కాదు. ఏ దేవుడైతే నిన్ను నా ఎద్దులను తినమని పంపా డంటున్నావో ఆ దేవుడే నన్ను ఈ ఎద్దుల సహాయంతో భూమిని దున్నుకుని జీవించమన్నాడు. కనుక నువ్వు నీ ఆహారంకోసం యింకెక్కడైనా ప్రయత్నించు" అన్నాడు.

కాని పులి అందుకు ఒప్పుకోలేదు. "అదేమీ వీలుపడదు. అట్టే ఆలస్యం చెయ్యక వెంటనే ఎద్దుల్ని విప్పి నా ముందర పెట్టు. లేకపోతే నేనే వాటి పని పడతాను" అని డబాయించింది.

కాపు మళ్లీ ఆలోచన్లో పడ్డాడు, ఈ పులి బాధ ఎలా తప్పించుకోటమా అని. చటుక్కున ఒక ఉపాయం తోచింది. "పులి మామా! నీకు ఆకలితీరటమే కదా కావలసింది. ఇంటిదగ్గిర నాకో మాంచి బలిసిన

కొలగొట్ల శాంతకుమారి, ఏలూరు



అవుంది. కాసేపు ఆగావంటే నేను ఇంటికి వెళ్లి ఆ ఆవుని తెచ్చి నీకు యిస్తాను. ఎద్దుల్ని మాత్రం వదలిపెట్టు. ఎద్దులు లేకపోతే నాకు బ్రతుకేలేదు " అన్నాడు.

పులికి మాత్రం ఎద్దులే కావాలని లేదుగా. దానికల్లా తన కడుపు ఎలాగైనా నిండితే చాలు. అందుచేత " సరే, అలాగే లేవయ్యా, అయితే త్వరగాపోయి నీ ఆవుని తోలుకురా " అంది.

ఇప్పటికి ఈ గండం గడిచిందిగదా అని కాపు ఇంటిదోవ పట్టాడు. ఇంటికిచేరుకుని, భార్యతో జరిగిన సంగతంతా చెప్పి, తను ఆవుని పులికి ఆహారంగా యిస్తానని చెప్పి వచ్చిన సంగతి కూడా చెప్పాడు. అంతా విని కాపువాని భార్య మండిపడింది. " చాలు చాల్లే. మహా తెలివైన పని చేసుకొచ్చావ్. ఆవుని యిచ్చివేస్తే పిల్లలకు పాలెక్కడినించి వస్తయ్యనుకొన్నావ్? అదీకాక, నాకు పరమాన్నమంటే ఎంతో యిష్టం. పాలు లేకపోతే నాకు పరమాన్నమెలా వస్తుంది? అందుకని, ఆవుని యివ్వటానికి ఏమాత్రమూ వీల్లేదు. కావలిస్తే నీ ఎద్దుల్ని యిచ్చుకో " అని మొండికేసింది.

" ఓసి వెఱ్ఱిదానా! మనం ప్రాణాలు నిలుపుకోవాలంటే అన్నం కావాలిగాని, పరమాన్నం లేకపోతే చచ్చిపోతామా. అన్నం కావాలంటే ధాన్యం కావాలి. ధాన్యంకోసం పొలం దున్ని పండించాలి. పొలం దున్నటానికి ఎడ్లు కావాలి. కనక ఎడ్లని యిచ్చుకుంటే మనం పస్తులుండాల్సిందే. కాబట్టి ఆవుని యిచ్చుకుని ఈ ఆపద నించి తప్పించుకుందాం. లేదా, నీ కింకేమైనా యింతకంటె మంచి

ఆలోచన తోస్తే చెప్పు, అలా చేస్తాను" అన్నాడు కాపు.

కాపుభార్య కాసేపు ఆలోచించింది. మెరుపులా ఆమెకి ఒక చక్కటిఉపాయం తోచింది. "సరే, నాకో మాంఛి ఉపాయం తట్టింది. దానివల్ల మనం, ఎద్దుల్నీ వదులుకో అక్కర్లేదు, ఆవునీ వదులుకో అక్కర్లేదు. నువ్వు యిప్పుడే పులి దగ్గిరికి పోయి 'అవుని నా భార్య తీసుకుని వస్తోంది' అని చెప్పు" అని కాపుని పులి దగ్గిరికి పంపింది.

సరే నని కాపు పులిదగ్గిరికి వచ్చి, "ఇంటికి వెళ్లి అన్నీఏర్పాటు చేసివచ్చాను. నా భార్య ఆవుకి పూజచేసి యిప్పుడే తెస్తుంది. కొంచెం ఆగు" అని చెప్పాడు. సరేనంది పులి.

ఇంతలో కాపుభార్య, చీరె బిగించి కట్టి ఒక గుఱ్ఱం మీద ఎక్కి అక్కడకు వచ్చింది. వస్తూనే, పులివైపు చూస్తూ, "అబ్బా! ఇందాకటినించీ వెతుకుతున్నాను, మూడోపులి ఎక్కడ దొరుకుతుందా అని. నా అదృష్టం కొద్దీ, ఈ పులి దొరికింది. ఇవ్వాల్టికి నాకు ఈపులితో పూర్తిగా కడుపు నిండుతుంది" అని బిగ్గిరిగా అంది.



ఈ మాటలు చెవినిబడగానే పులి వెనక్కుతిరిగి చూడకుండా ఒకటే పరుగు లంకించుకుంది. కాపు తన భార్య పన్నిన యుక్తికి సంతోషించాడు. మళ్లీ పులి ఆ చాయలకి రానేలేదు. కాపు తన ఎద్దులతో మామూలుగా పొలందున్ని పంటపండించుకుంటున్నాడు. కాపు భార్య, పిల్లలు ఆవు పాలతో ప్రతిరోజూ పరమాన్నం ఒండుకుని తృప్తిగా తింటూన్నారు.

అంతటితో కథ కంచి కెళ్లింది. కలం జేబు కెళ్లింది.



# ఎలుక

ప్రొద్దు గ్రుంకే టప్పు
డెద్దంత నక్క
ద్రాక్ష పందిరి క్రింద
తారాడుతుంది.

ఎగిరింది పండ్ల కొఱ
కిందె దొలగింది
తొంటి నీడుచుకొంటు
త్రోవ పట్టింది.

బాటలో పిల్లెదురు
పడి యిట్టులంది:
"నక్కబావా! కాలు
చిక్కబట్టిందా?
పరువెత్తి రాళ్లలో
విరుగబడ్డావా?"

నక్క: "పరువెత్త లేదోయి
విరుగబడలేదు
ఈపాడు పందిట్లో
ఎలుక గఱచింది."

పిల్లి: "ఏదేది చూపింపు
మెవ్వరను కొందో?
డొక్క చీలిచి దాన్ని
డోలు కట్టిస్తా."

నక్క: "అది గదిగో? కూర్చున్న"
దని కొంటెనక్క
విత్తు ముదిరిన ద్రాక్ష
గుత్తి చూపింది.

# చిక్కిందా?

పంది రెగబ్రాకింది
బావురుం బిల్లి
గుత్తి గాలిస్తూనె
కొస కిట్టు లంది.
"ఎలుక కన్పడ కున్న
దేమోయి? బావ?"
నక్క: "కనపడుతుందిలే
గాలింపవోయి!"
అంటు రాలినపండ్ల
నప్పళిస్తుంది.
ఎలుక చిక్కక పిల్లి
ఎగరొప్పు తుంటే,
నక్క లోలోపల
నవ్వి యిట్లంది.
"చీలికాడా? ఎలుక
చిక్కెనా? లేదా?
ఊహూప్సు, మదిగో తో
కూపుతుంటేను"
జంగు బిల్లింకా హూ
షారు చేసింది
పండ్లన్ని దిని నక్క
బాట పట్టింది.
ఉబ్బు లింగళ్లను
ఉబకేసి యిల్లె
కొంప లాటిపి కడుపు
నింపు కొంటారు.

— ఏటుకూరి





1



2



3



4



5



6



7



8

## అబ్బాయిలూ, అమ్మాయిలూ!

పైన చూశారూ, మన స్వతంత్రజెండాలు తొమ్మిదిఉన్నై. ఆ తొమ్మిది చూడటానికి ఒకేమోస్తరుగా వున్నట్లు కనిపిస్తున్నయికదూ. కాని అలాలేవు. తొమ్మిదింట్లో ఏడుజెండాలు ఒకమోస్తరువి, మిగతా రెండు ఒకమోస్తరువి. ఆ రెండు జెండాలు ఏవో కనుక్కోండి. మీరు కనుక్కోలేకపోతే జవాబుకు చివరి పేజీలలో చూడండి.




# పితృప్రేమ



ఒకానొక వూళ్లో ఒక షాహుకారు వుండేవాడు. అతని పేరు ధర్మ బుద్ధి. పేరుకు తగ్గట్టుగానే అతను ధర్మగుణాలు కలిగి, దైవభక్తితో నడుచుకునేవాడు. అబద్ధమాడిగానీ, ఒకరిని ఒకమాట అనిగానీ, ఒకరికి ఒక హాని తలపెట్టిగానీ ఎరగడు. అతని మంచిగుణాలకు ఆవూళ్లోవాళ్ళంతా అతన్ని మెచ్చుకొనేవారు.

ఇలాంటి మన ధర్మబుద్ధికి లేకలేక ఒక పుత్రుడు కలిగాడు. అతనికి నారాయణుడని పేరు పెట్టాడు. తండ్రి ఎంత మంచివాడో నారాయణుడంత చెడ్డవాడుగా తయారయ్యాడు. ఒక ఏడు కొకఏడు పైబడ్డకొద్దీ నారాయణ చెడ్డఅలవాట్లు అలవరచుకో సాగాడు. దుర్మార్గుల స్నేహం చేయసాగాడు. లేకలేక పుట్టటంచేత ధర్మబుద్ధి కొడుకుని ఏమీ అనేవాడు కాదు. ఏదో చిన్నతనంవల్ల అలా చేస్తున్నాడని చూసీ చూడనట్టు పోతుండేవాడు.

నారాయణ పెరిగి పెద్దవాడైనకొద్దీ మరింత చెడుత్రోవల్ని నడవసాగాడేగాని మంచి మార్గాన పడలేదు. ధనవంతుడి బిడ్డ కనుక నారాయణ దగ్గిర ఎప్పుడూ డబ్బు వుంటు వుండేది. ఇది చూచిన స్నేహితులు నారాయణ స్నేహంకోసం మూగేవారు. అతను వారి మాయలో పడి వారు ఆడించినట్లల్లా ఆడుతూ, తండ్రి మాట లెక్క చెయ్యకుండా తిరిగేవాడు. జూదంమొదలైన చెడ్డ అలవాట్లు చేసుకున్నాడు. క్రమేణా నారాయణ ఆరోగ్యం క్షీణించసాగింది.

ఇంతవరకూ తనకొడుకు ఎన్ని దుర్గుణాలు నేర్చుకున్నా ధర్మబుద్ధి, పుత్రప్రేమచేత, ఏమీ అనకుండా చూస్తూ సహించి వూరుకున్నాడు. కాని యిప్పుడు తన కొడుకు ఆరోగ్యమే పాడవుతున్నదని

మున్నంగి రాజగోపాలాచార్యులు




గ్రహించగానే ధర్మబుద్ధికి వూరుకో బుద్ధి పుట్టలేదు. వంటరిగాపిలిచి కొడుక్కి ఎన్నో విధాల మంచిమాటలతో నచ్చ చెప్పి చూశాడు. ఉహుఁ. లాభంలేక పోయింది. తిట్టాడు, భయపెట్టాడు; కాని నారాయణ వాటిని కూడా లెక్కచేయలేదు. ఆరోజు మొదలు నారాయణకి డబ్బు అందకుండా కట్టుదిట్టంమాత్రం చేశాడు, తండ్రి.

ఎప్పుడైతే నారాయణదగ్గిర డబ్బు సన్నగిలిందో అంతవరకూ వెంట వుంటున్న స్నేహితులు ఒక్కరొక్కరే జారుకోసాగారు. అఖరికి నారాయణ ఒంటరివాడైనాడు. ఇంట్లో తండ్రి కూడా చీవాట్లు పెట్టటం ఎక్కువ కాసాగింది. నారాయణకి ఆ వూళ్లో వుండ బుద్ధిపుట్టలేదు. ఒకనాటి రాత్రి ఎవరితోటీ చెప్పకుండ నారాయణ యిల్లువదిలి బయలుదేరాడు.

తెల్లవారి లేచి చూచేసరికి కొడుకులేడు. ధర్మబుద్ధి చాల విచారించాడు. కన్న మరులు పొమ్మంటే పోతుందా? పైగా తన వంశం నిలబెట్టటానికిగాను అతడొక్కడే కొడుకు. ధర్మబుద్ధి వెంటనే తన నౌకర్లని పిలిచి "నారాయణ తెల్లవారే సరికి ఎటో పరారై పోయాడు. మీరు వాడికి తెలియకుండ వాడి వెంట వెంటనే పోతూ వాడికి కావలసిన తిండీ, తిప్పలూ, ఇతర సౌకర్యాలు అమరుస్తూ ఉండండి" అని చెప్పి పంపాడు. నౌకర్లు వెంటనే నారాయణని వెతుక్కుంటూ బయలుదేరారు.

నారాయణ, తను ఎక్కడికి పోవాలో, ఏమి చెయ్యాలో ఆలోచించుకొని బయలు దేర లేదు. ఆ రోజు ఉదయం మొదలు సాయంత్రం వరకూ తిరిగి, తిరిగి చివరికి సాయంత్రానికి ఒకవూరు చేరుకున్నాడు. ఆకలి దహించుకుపోతుంది. చేతులో రాగి దమ్మిడీ కూడా లేదు.

అలా పోతూ వుండగా ఒక మిఠాయి దుకాణం కనిపించింది. ఈ దుకాణం

ఎవరిదో కాదు. ధర్మబుద్ధి పంపిన నౌకర్లే నారాయణకంటె ముందక్కడికి చేరుకుని, నారాయణకు తిండీ అవీ సమకూర్చటానికి దుకాణం పెట్టుకు కూర్చున్నారు.

నారాయణ దుకాణం దగ్గిరికి వెళ్లాడు. "బాబూ, చాల దూరంనించి వస్తున్నాను. అకలి వేస్తోంది. ఏమైనా కొనుక్కు తిందామంటే నా దగ్గిర డబ్బు లేదు. నా మీద దయ తలచి ఏమైనా తింటానికి పెడితే మీ పేరు చెప్పుకుంటాను" అన్నాడు.

నారాయణ ఈ విధంగా అడగటమే తడవుగా నౌకర్లు అతనికి కావలసినన్ని ఫలహారములు పెట్టి, ఇంకా మిగత సౌకర్యాలు ఏర్పాటుచేసి ఆ రాత్రికి అక్కడే పడుకోటానికి చోటు యిచ్చారు.

* * *

తెల్లవారింది. నారాయణ ఆ దుకాణదార్ల సహాయానికి ఎంతో కృతజ్ఞత చూపి మళ్లీ తన దోవన బయలుదేరి పోసాగాడు.

మధ్యాహ్న మయేసరికి నారాయణ ఒక ఏరు దగ్గిరికి చేరుకున్నాడు. ఏరు నిండుగా ప్రవహిస్తోంది. అవతలిగట్టుకు చేరటం ఎలాగా అని ఆలోచిస్తున్నాడు నారాయణ. ఇంతలో ఆ పడవ అబ్బాయి వచ్చి "రా, అబ్బాయి. అవతలిగట్టుకు చేరుస్తాం" అన్నాడు. ఈ పడవవాళ్ళు ఎవరో కాదు. ధర్మబుద్ధి నౌకర్లే.



"నేను మీ కేమీ డబ్బు యిచ్చుకోలేనే" అన్నాడు నారాయణ దీనంగా.

"పరవాలేదు. నిన్ను వూరికెనే తీసుకుపోతాము" అని పడవవాళ్లు నారాయణని ఏరు దాటించారు. నారాయణ మళ్లీ నడక సాగించాడు.

సాయంకాలానికి నారాయణ ఒక పెద్ద కొండదగ్గిరికి చేరాడు. కొండకి ఆ ప్రక్కని ఒక వూరుంది. నారాయణకి కడుపులో కాలుతోంది. ఎలాగైనా కష్టపడి ఆ ప్రక్క వూరు చేరగలిగితే యింత తినటానికి దొరుకుతుందేమోనని నారాయణ కొండ

ఎక్కసాగాడు. కాళ్లు నొప్పులుపుట్టసాగాయి. పైగా రోజల్లా తిండీ, నీళ్లులేవాయె! ఎలాగా భగవంతుడా అని నారాయణ దిక్కులు చూడసాగాడు.

ఇంతలో ధర్మబుద్ధి నౌకర్లు ఒక మేనాతో అక్కడికి ప్రత్యక్షమైనారు. నారాయణ అడగకుండానే, "దీంట్లో కూర్చోఅబ్బాయ్ నిన్ను కొండఅవతలికి చేరుస్తాం" అన్నారు. నారాయణకి ఎంతో సంతోషం కలిగింది. వెంటనే మేనాలో ఎక్కి కొండ దాటాడు.

ఈలాగే నారాయణ ఎన్నో కష్టాలు ఎదుర్కోవలసి రావటం, ధర్మబుద్ధి నౌకర్లు అతన్ని ఆ కష్టాలనించి తప్పించి రక్షించటం జరుగుతోంది. ఆఖరికి ఒక రోజున నారాయణకి అనుమానం కలిగింది. ఈ సందేహం కలగగానే నారాయణ ఒక రోజు తనకు సహాయంచెయ్య వచ్చినవారిని అడిగాడు. "మీ రెవరు? నా కెందు కిలా సహాయం చేస్తున్నారు?" అని.

అప్పుడు వాళ్లు జరిగినదంతా చెప్పారు. అంతా విని నారాయణ చాల ఆశ్చర్య పోయాడు. తను ఎంత చెడుగా ప్రవర్తించినా, చివరికి ఇల్లు వదిలి వచ్చేసినా తన తండ్రిమాత్రం తనసుఖం, క్షేమంకోరేకదా ఇలా సేవకుల్ని పంపి తనకు సహాయం చేయించాడు. అలాంటి తండ్రిమాట లక్ష్య పెట్టక పోవటం తన బుద్ధి తక్కువే నని గ్రహించాడు. వెంటనే సేవకులతోయింటికి తిరిగి వచ్చి తండ్రి పాదాల ముందు వాలి తననిక్షమించమనీ, ఇకముందు బుద్ధిగలిగి బ్రతుకుతాననీ ఏడ్చాడు.

ఇప్పటికైనా తన కొడుకు మంచి మార్గానికి వచ్చాడని ధర్మబుద్ధి ఎంతో సంతోషించాడు. తన వంశమర్యాద నిలబెట్టటానికి తనకుగల్గిన ఒక్కగా నొక్క కొడుకును తను నిలుపుకోగలిగినందుకు ఎంతో గర్వించాడు. ఆనాటినించీ తండ్రీకొడుకులు సుఖంగా కాలం వెళ్లబుచ్చ సాగారు.






అనం గనంగా పూర్వం ఒక పట్టణాన్ని మంచి తెలివితేటలు గల రాజు పరిపాలిస్తుండేవాడు. పాపం! ఆయనకు పిల్లలు లేరు. ఆ పట్నపురాణి చేయని వ్రతము లేదు, పట్టనినోము లేదు. కాని ఏంలాభం! ఎన్నిచేసినా పాపాయీలు పుట్టలేదు. పిల్లలేని దిగులుతో రాజు, రాణి కృశించి పోతున్నారు.

ఒకరోజున రాణిగారు, చెలికత్తెలు కలిసి, వాళ్ళ తోటలో వున్న కోనేరులో స్నానం చేస్తున్నారు. అప్పుడు బంగారంలా మెరుస్తున్న ఒక పెద్దకప్ప కనుపించింది. అది పచ్చగ ధగ ధగ మెరుస్తూ నీళ్ళల్లో తేలుతూ - మునుగుతూ, ఎగురుతున్నది. రాణిగారు చాలసేపు ఆ కప్పను చూచి తనలో యీ విధంగా అనుకున్నది.

"ఆహా! ఆ కప్ప ఎంత చక్కగావుంది! నాకు ఆడపిల్ల పుడితే ఈ కప్పకిచ్చి పెండ్లి చేస్తునుగదా!" అని. రాణి యిలా అనేసరికి కప్ప బెక బెక అరుస్తూ తనకోర్కె నెరవేరినట్లు అదొక రకంగా రాణిగారివైపు కాస్సేపు చూచి, బుడింగుమని మునిగింది. రాణిగారికి శరీరం పులకరించినట్లయింది.

ఇది జరిగినమరుసటినెలకే రాణీగారు గర్భవతి అయింది. ఈ సంగతి వినగానే రాజుగారు, ఆయన పరివారం – ప్రజలు అంతా సంతోషంగా పండుగ చేసుకున్నారు. తొమ్మిది మాసములు సంతోషంగా గడిపి రాణి అందాల భరణివంటి చక్కని ఆడ శిశువును కన్నది. రాజుగారి సంతోషం ఇక చెప్ప శక్యం కాకుండా వుంది. ప్రజలంతా అనందోత్సవాలతో మునిగి తేలు

దీవి భానుమతీ దేవి



తున్నారు. పదవరోజున తల్లికీ పిల్లకూ చందనస్నానం చేయించి, పారోహితులు "రోహిణి" యని పేరుపెట్టి జాతకము వ్రాయించారు.

రోహిణి దిన దినమున కొక్క చాయ చొప్పున శుక్లపక్షపు చంద్రునివలె సకల భోగములతో పెరిగి పదునారు సంవత్సరముల జవ్వనియైంది. ఈ సంతోషములో రాణి తను పూర్వం కప్పకు, మనస్సులో చేసిన వాగ్దానం మరచిపోయింది.

ఇప్పుడు రోహిణికి పెళ్ళి చేయాలని ప్రయత్నం చేస్తున్నారు.

ఈ సంగతి విన్న కప్ప, మండిపడుతూ కొలనంతా రొదచేస్తున్నది. ఒక రోజు రోహిణి, స్నానంచేయటానికి తన తల్లిగారి కోనేరు కొచ్చింది. సమయంకోసం ఎదురు చూస్తున్న కప్ప రోహిణిరాగానే ఎగిరి బుజానెక్కింది. రోహిణి భయపడి దానిని విదలించి నీటిలోకి నెట్టివేసింది. కాని,కప్పమళ్లీ ఎగిరి పై కెక్కింది. రోహిణి దాన్ని మళ్లీ నీటిలోకి త్రోసి వొడ్డుకొచ్చినా, కప్ప వెంటబడి భుజ మెక్కింది.

రోహిణికి విసుగుపుట్టి ఆ కప్పను ఒళ్లో వేసుకొని యింటికొస్తున్నది. దార్లో అమ్మలక్కలు "నీ వొళ్లో దేమిటి?" అన్నారు. రోహిణి కేమీతోచక "తమలపాకుల కట్ట" అంది. ఈ మాటలు విని వొళ్లోవున్న కప్ప యెగిరి యివతలకు దూకి కోపంగా యిలా అంది—

"కప్పాయి, కప్పాయి, అనరాదా ?
కాళ్ళగిజిగా దనరాదా ?

మన్యపుసూర్యం డనరాదా?

మా యింటి మగవారనరాదా?

తనకట-నేనట-తమలపాకుల కట్టనట!

తందునా! తల పగుల!!!"

ఈమాట లంటూనే కప్ప ఎగిరి మళ్ళీ రోహిణి వొళ్లోకిదూరింది. అమ్మలక్కలంతా ఆశ్చర్యంగా చుట్టూ చేరారు. రోహిణి సిగ్గుతో ఇంటికిపరుగెత్తి జరిగిన సంగతంతా వాళ్ళమ్మతో చెప్పింది. అప్పుడు వెనకటి సంగతంతా రాణి గారికి జ్ఞాపకం వచ్చి, రోహిణితో పూర్వంజరిగినసంగతి చెప్పింది. రోహిణి తన తల్లిమాట నెరవేర్చటానికై కప్పను పెళ్లి చేసికోవటాని కిష్టపడింది.

అప్పుడు తన కూతురు మాతృభక్తి మెచ్చుకొని ఆకాశంఅంత పందిరి - భూదేవంత అరుగువేసి బ్రహ్మాండంగా — రోహిణిని కప్ప కిచ్చి పెళ్లి చేశారు.

పెళ్లికాగానే రోహిణి తలితండ్రులవద్ద శలవుతీసికొని కప్పను బుజానెక్కించుకొని ఒకఅడివిలో కెళ్లి, పార్వతీ పరమేశ్వరుల గురించి తపస్సుచేయడం మొదలుపెట్టింది.



కొన్ని సంవత్సరాలకు భగవంతుడు ప్రత్యక్షమై నీ కేంకావాలో కోరుకోమన్నాడు. అప్పుడు రోహిణి తన భర్తకు మనుష్య రూప మిమ్మని కోరింది. 'సరే'నని వారు మాయమైయారు. వెంటనే కప్ప చక్కని రాజకుమారుడుగా మారింది. రోహిణి సంతోషంతో భర్తను వెంటబెట్టుకొని యింటికి వచ్చింది. తల్లిదండ్రులు మిక్కిలి అనందపడి తిరిగి మహావైభవంగా పెళ్లిచేశారు. అంతా సుఖంగా కాలం గడుపుతున్నారు. కథ కంచికి-మనం ఇంటికి.




( గతసంచిక తరువాయి )

వర్ధమానుడికి వామనులు 'మనిషి పర్వతం' అని పేరు పెట్టారు. అతన్ని చూడటానికి వేలకు వేలు జనం వచ్చి దేవాలయంముందు వీథుల్లో బారులు తీర్చి నిలబడ్డారు. దేవాలయంలోనికి ఎదురుగా అయిదడుగుల ఎత్తు బురుజున్నది. రాజుగారూ, రాణీగారూ, వారి పరివారమూ ఈ బురుజులో ఎక్కి వింత చూస్తున్నారు.

వర్ధమానుడు దేవాలయం వాకిలికుండా లోనికి పాకిపోయి తన ఇల్లంతా చూసుకుని మళ్ళీ బయటికి వచ్చి, తన నిడివిని ప్రజలకు చూపటానికి లేచి నిలబడ్డాడు. అక్కడ నిలబడితే చుట్టూ ఉన్న ప్రదేశమంతా కొండపల్లి బొమ్మలాగా కనిపించింది. పొలాలలో నలభై అడుగుల చదరాల మళ్ళుకనిపించాయి. దూరాన అడవులున్నాయి. అందులో మరీ ఎత్తయినచెట్లు ఏడేసి అడుగు లున్నాయి. మరొక ప్రక్క బొమ్మరిల్లు అమర్చినట్టుగా పట్టణం ఉంది.

రాజుగారు వర్ధమానుడితో మాట్లాడటానికి బురుజు దిగి తన గుర్రం ఎక్కి వర్ధమానుడి దగ్గిరికి వచ్చాడు. కాని వర్ధమానుడి ఆకారం చూసి రాజుగారి గుర్రం బెదిరింది. మంచి రౌతుగనక ఆయన గుర్రం మీద నుంచి కింద పడకుండా, భటుల సహాయంతో ఉపాయంగా గుర్రం దిగి, వర్ధమానుడి దగ్గిరకి కాలినడకనే వచ్చాడు. రాజుగారి వీలుకోసరం వర్ధమానుడు నేలమీద పడుకున్నాడు. రాజుగారి చేతిలో దూసిన కత్తి ఒకటి ఉంది. అది సరిగా వర్ధమానుడి చిటికెన వేలంత ఉంది. రాజుగారి నెత్తిమీద కిరీటం చిటికెన వేలి ఉంగరమంత ఉంది. అందులో రత్నాలు మెరుస్తున్నాయి.

జోనాథన్ స్విఫ్ట్ వ్రాసిన గల్లివర్స్ ట్రావెల్సుకు అనుకరణ.



రాజుగారు వర్ధమానుడితో గొంతు చించుకొని ఏదో మాట్లాడాడు, కాని వర్ధమానుడికి అర్థంకాలేదు. వర్ధమానుడికి చాలా భాషలు వచ్చు సంస్కృతమూ, ప్రాకృతమూ, పాళీ, పైశాచీ మొదలైన భాషలన్నిటిలోనూ రాజుతో మాట్లాడాడు. కాని ఆ భాష లేవీ రాజుగారికి తెలియవు. రాజుగారి ఆస్థానకవులకు కూడా వర్ధమానుడి భాష లేవీ అర్థం కాలేదు.

"ఇతడికి మనభాష రాదుగాని సాధువులాగే కనిపిస్తున్నాడు. ఇతనివల్ల మనకు చాలా ప్రయోజనం ఉండవచ్చు. కనక ఇతనికి సరిపడే ఆహారం ఇచ్చి జాగ్రత్తగా కాపాడండి" అని రాజు తన భటులకు ఆజ్ఞాపించాడు.

రాజపరివారం వెళ్ళిపోగానే భటులు వర్ధమానుడికి అనేక బళ్ళమీద భక్ష్యాలూ, పానీయాలూ తెచ్చి భోజనంపెట్టారు. అతన్ని చూడవచ్చిన జనం ఎంతకీ వెళ్ళలేదు. అందులో కొందరు రాలుగాయిలు అతనిమీద బాణాలు కూడా విసిరారు. ఇలా చేసినవాళ్లను రాజభటులు బంధించి శిక్షించమని వర్ధమానుడికి అందిచారు. వర్ధమానుడు వారిని ఎత్తి తన జేబులో వేసుకున్నాడు. వాళ్ళని అతను నల్లులన రాచినట్టు రాచేస్తాడని ప్రజలుభయకంపితులైనారు. కాని వర్ధమానుడు వారితో ఆడుకొని చివరకు కట్లు విప్పి వారిని వదిలేశాడు. ఈ వార్త విని ఆస్థానంలో వర్ధమానుడికి చాలా ప్రశంసలు వచ్చాయి.

వర్ధమానుడికి ఒక పరుపు తయారు చేయమని రాజాజ్ఞ అయింది. రాజుగారి దర్జీలు ఈ పని ఎట్లా సాధ్యమవుతుందా అని ఆలోచించటానికి సమావేశమై ఆఖరుకు ఒక తీర్మానంచేశారు. ఆరువందల పరుపులు బళ్లమీద దేవాలయానికి చేర్చి వాటిని ఆ ఆవరణలోనే కలిపి కుట్టటానికి నిశ్చయించారు. నాలుగేసి చిన్నపరుపుల మందానా, నూటయాభై పరుపుల విస్తీర్ణానా వర్ధమానుడి పక్క తయారయింది. ఇది



కూడా అతనికి తగినంత మందంగా లేదు. ఈ విధంగానే అతనికి దుప్పట్లు కూడా తయారుచేశారు. జేబురుమాల సైజున ఉన్న మామూలు దుప్పట్లు అనేకవందలు కలిపి చేతికుట్లు కుట్టి, పక్కమీద పరుచుకోవటానికీ దుప్పట్లు తయారుచేశారు. ఈ దుప్పట్లు పది పన్నెండు పరసలు కుడితే గాని వర్ధమానుడికి చలికాసే దుప్పటి తయారు కాలేదు.

వర్ధమానుడికి వామనభాష నేర్పటానికీ, వర్ధమానుడిభాష నేర్చుకుని అతని చరిత్ర తెలుసుకోటానికీ రాజుగారు పండితుల నియమించాడు. వామన దేశాచారానికి అనుకూలంగా వర్ధమానుడికి దుస్తులు నిర్మించటానికి మూడువందలమంది దర్జీలు నియమించబడ్డారు. అతన్నిచూసి బెదరకుండా ఉండగలందులకు రాజుగారి అశ్వాలకు వర్ధమానుడి సమక్షంలో రోజూ కవాతు ఇవ్వసాగారు.

"మనిషి పర్వతాన్ని" చూడటానికి పల్లెపట్టులనుంచి తీర్థప్రజ కింద రాజధానికి రోజూ వస్తున్నారు. ఇట్లా వచ్చే మూర్ఖ ప్రజవల్ల రాజమిత్రుడైన వర్ధమానుడికి అపాయంతటస్థించే అవకాశం ఉంది. అందుచేత పల్లెలనుండి రాజధానికి వచ్చే ప్రజలకు "పెర్మిట్లు" ఏర్పాటు చేశారు





రాజుగారు. అవిలేనిదే ఎవరూ రాజధానిలో అడుగుపెట్టరాదు. రాజుగారిలా చేయక పోతే దేశంలో ఉండే ప్రజలంతా పని పాటలు మానేసి వర్ధమానుడిదగ్గిరే యాత్ర చేసేవాళ్లు.

సామాన్యప్రజలకు వర్ధమానుడి మీది భయం క్రమంగా తొలిగిపోయింది. వాళ్లు అతనిదగ్గిరకి చనువుగా రాసాగారు. అతని అరిచేతమీద తడవకు అయిదారుగురు చొప్పున నృత్యాలు చేసేవారు. చిన్నపిల్లలు యథేచ్ఛగా అతనిజుట్టులో దాగుడుమూత లాడసాగారు.

వర్ధమానుడికి దేశభాష వచ్చాక రాజు గారు అప్పుడప్పుడూ వచ్చి అతనిచేతిమీదా, భుజంమీదా ఎక్కి సంభాషించేవాడు. తన దేశప్రజలయెడల స్నేహంతో ఉన్నం దుకు అతన్ని అభినందించేవాడు.

"నన్ను తమరు అన్నివిధాలా ఎంతో చక్కగా చూస్తున్నారుగాని ఈ గొలుసులు వదిలించినట్టయితే నేనింకా తమకు కృత జ్ఞుడనై ఉండగలను" అని వర్ధమానుడు రాజుగారికి విన్నవించుకున్నాడు.

"చూద్దాం, చూద్దాం!" అంటూ రాజు గారు ఏదీ చెప్పకుండా మాట తప్పించి ఇంటికి వెళ్లిపోయాడు.



దీనికీ కారణం లేకపోలేదు. రాజుగారి ఆస్థానంలో కొందరు వర్ధమానుణ్ణి నిర్మూలించాలనే ఉద్దేశం కలిగిఉన్నారు. ఇంత బలిష్ఠుడివల్ల రాజ్యానికి ఎప్పటికైనా ముప్పేనని వాళ్ల నమ్మకం. ఈ సంగతి వర్ధమానుడు ఆనోటా ఆనోటా తెలుసుకున్నాడు. కాని, రాజుగారు తనపట్ల మిత్రుడై ఉండగా తన కేభయమూ లేదనుకున్నాడు. ఈసారి మళ్లీ రాజుగారు తనను చూడటానికి వచ్చినప్పుడు తన విడుదల విషయం అడిగాడు.



"స్వయంగా నాకేమీ అభ్యంతరంలేదు. కాని, ఇది పూర్తిగా నా చేతిలో ఉన్న పని కాదు. నా మంత్రులూ, అనుచరులూ నీ విషయంలో భయంతో ఉన్నారు. వారి భయం పోగొట్టాలంటే నిన్ను నా భటులు వెతకటం తప్పని సరి. నీ సహకారం లేకుండా నా భటులు నిన్ను వెతకలేరు. దానికి సమ్మతమేనా ?" అన్నాడు రాజు.

తనను రాజభటులు వెదకటానికి వర్ధమానుడు అంగీకరించాడు. అతని దుస్తులు అన్వేషించటానికి ఇద్దరుభటులు వచ్చారు. వర్ధమానుడు వారిని తన జేబు లన్నిటిలోకీ దింపాడు. వాళ్లు వెళ్లి రాజుగారితో ఈ విధంగా విన్నవించుకున్నారు:

"ప్రభూ, మనిషిపరత్వంజేబుల్లో మాకు చాలా వింతవిషయాలు కనిపించాయి. ఒక జేబులో తమ పడకగదిలో పరచటానికి సరిపడే గోనెపట్టాలాటి ముతకగుడ్డ కనిపించింది. (ఇది వర్ధమానుడి చేతి రుమాలు). ఆ జేబులోనే పెద్ద పెద్ద బంగారు దిమ్మెలు కనిపించాయి. వాటి మీద పెద్ద అక్షరాలూ బొమ్మలూ చెక్కి ఉన్నాయి. (ఇవి బంగారు నాణెములు). మరొకజేబులో పెద్ద వెండిపెట్టె కనిపించింది. అది తెరిపించిచూడగా అందులో మోకాలిలోతున మట్టివంటి పొడి ఉంది. అందులో మేము దిగేసరికి మాకు తుమ్ములు పట్టుకుని చాలా బాధకలిగింది. (ఇది వర్ధమానుడి నస్యం డబ్బీ). అతని దగ్గిర ఒక విచిత్రమైన నిచ్చెనలాటి వస్తు

వున్నది. అయితే ఈ నిచ్చెనకు ఒకవైపే దూలం ఉన్నది. ఈ దూలంమీద భయంకర మైన ముళ్లు పలుగుల్లాగా నిలబడి ఉన్నాయి. (ఇది దువ్వెన) బంధితుడి నడుమున బ్రహ్మాండమయిన దూలం వేలాడుతున్నది. అది లోహంతో చేసినట్టు కనిపిస్తున్నది. దీని ఉపయోగమేమిటో తెలియరాలేదు. (ఇది వర్ధమానుడి కత్తిఒర).'

రాజుగారు మూడువేలమంది సాయుధభటులను వెంటబెట్టుకొని ఈ జాబితాలో ఉన్న వస్తువులన్నీ ఇవ్వమని వర్ధమానుణ్ణి అడిగాడు. వర్ధమానుడు రాజభటులు చూపిన వస్తువులన్నీ ఇచ్చేస్తూ ఒరలో నుంచి కత్తిదూసి చూపాడు. ఎండలో కత్తి తళ తళ లాడుతూంటే రాజభటులు దిగ్భ్రమ చెందిపోయినారు. రాజుగారు ఆ కత్తి మళ్లీ ఒరలో పెట్టించి దాన్నికూడా పుచ్చుకున్నారు.

ఇది జరిగినాక తనను బంధ విముక్తుణ్ణి చెయ్యవలసిందని వామనభాషలో వర్ధమాను డొక అర్జీ పెట్టుకున్నాడు. కొన్ని షరతులమీద అతనికి బంధవిముక్తి కలిగించారు. ఆ షరతులేవంటే, వర్ధమానుడు రాజాజ్ఞ లేకుండా దేశంవిడిచి పోగూడదు. రాజధానిలో అడుగుపెట్టాలంటే రెండు గంటలు ముందుగా తెలియజేయాలి. జనం వీధులన్నీ ఖాళీచేయటానికిగాను ఇట్లా తెలియజేయాలి. వర్ధమానుడు రాజవీథులలోతప్ప సంచరించరాదు. పచ్చిక బయళ్లలోను, పొలాలలోనూ అతను పడుకోరాదు. ఎవరిమీదా, ఎవరి ఆస్తిమీదా కాలువేయరాదు. శత్రువులు మీద పడే పక్షాన వర్ధమానుడు వామనులపక్షాన పోరాడాలి. ఈ షరతులకు ఒప్పుకుని వర్ధమానుడు బంధవిముక్తి పొందాడు.

[ఇంకా వుంది]





# గడుసువాడు

మా వూళ్లో పుల్లయ్యగారి పెరటి దొడ్డిలో ఒక పెద్ద నుయ్యి వుంది. ఆ నూతిని పుల్లయ్య, తన ప్రక్కయింటి బాపనయ్యకు రెండువందల రూపాయలకు అమ్మాడు.

బాపనయ్య నుయ్యి కొనుక్కున్నా డన్న మాటేగాని, చాలరోజులవరకు ఆ నూతిలో నీళ్లు తోడుకోవలసిన అవసరం బాపనయ్యకు కలగలేదు.

కొన్నాళ్లు గడిచినై. బాపనయ్య యింట్లో ఏదో శుభకార్యం వచ్చింది. చుట్ట పక్కాలు చాలమంది వచ్చారు. వాళ్ళందరి స్నానాలకీ తను పుల్లయ్యదొడ్డిలో కొన్న నుయ్యి చూపించాడు. వాళ్లు స్నానాలు చేద్దామని పోతే పుల్లయ్య బాపనయ్యకు అడ్డమొచ్చి, "నూతిలో నీరు తోడుకోడానికి వీల్లేదు" అన్నాడు.

బాపనయ్య తెల్లబోయాడు. "అదేమిటయ్యా, నూతిని నేను కొనుక్కొన్నానుగదా! నా నూతిలో నీరు తోడుకోవడానికి నీ యిష్టమేమిటి?" అన్నాడు.

"నువ్వు నూతిని కొనుక్కున్నమాట నిజమే. నేను నీకు నుయ్యి అమ్మానుగాని నూతిలో నీళ్లు అమ్మలేదు. అందుచేత నీళ్లు తోడుకోవటానికి వీల్లేదు" అన్నాడు పుల్లయ్య.

"అదేమిటయ్యా. నేను నూతిని కొనుక్కున్నది నీళ్ళకోసం గాకపోతే మరి దేని కనుకున్నావ్!" అన్నాడు బాపనయ్య.

"అదంతా నాకు తెలీదు. నీవు మాత్రం నీళ్ళు తోడుకోటానికి వీల్లేదు" అని మొండిగా జవాబు చెప్పాడు పుల్లయ్య.

వచ్చిన చుట్టపక్కాల ముందు యిలా అవమానం జరిగేసరికి బాపనయ్య చాల చిన్న పుచ్చుకున్నాడు. చుట్టాలు కూడా యిదంతా చూసి ఆశ్చర్యపోయారు.

ఆ మర్నాడు బాపనయ్య, పుల్లయ్య మీద కోర్టులో దావా చేశాడు. కోర్టువారు వాళ్లిద్దర్నీ పిలిపించి విచారించారు.

విడియాల వెంకటరామలక్ష్మమ్మ, ఏలూరు

"అయ్యా! ఈ పుల్లయ్య తన పెరటి దొడ్లోవున్న నూతిని నాకు అమ్మాడు. నేను కొనుక్కొన్న తర్వాత చాల కాలంవరకు నాకు ఆ నూతితో అవసరంలేక పోయింది. మొన్న మా యింట్లో ఒక శుభ కార్యం వచ్చి, చుట్టపక్కాల స్నానాలకి నూతిలో నీళ్లు తోడుకోబోతే 'నీకు నుయ్యి అమ్మాను కాని, నూతిలో నీళ్లు అమ్మలేదు. అందుచేత నీళ్లు తోడుకోటానికి వీల్లేదు' అని ఈ పెద్ద మనిషి మొండిగా అడ్డొచ్చాడు. ఇదేమి న్యాయమో తమరే విచారించండి" అని చెప్పుకున్నాడు బాపనయ్య.

తరువాత పుల్లయ్యని విచారించారు. బాపనయ్య చెప్పినదంతా నిజమే నని పుల్లయ్యకూడా ఒప్పుకున్నాడు.

"అయితే నువ్వు బాపనయ్యకు నీ నూతిని అమ్మి ఎన్నాళ్ళయింది?" అని అడిగాడు జడ్జి.

"సుమారు ఆరునెలలు అయింది" అని చెప్పాడు పుల్లయ్య.

"అలాగైతే ఈ ఆరునెలల నించీ నువ్వు బాపనయ్యనూతిలో నీ తాలూకు నీళ్ళు వుంచినందుకు నెలకు పది రూపాయల చొప్పున, ఆరునెలలకు అరవై రూపాయలు బాపనయ్యకు అద్దెచెల్లించి, నూతిలో వున్న నీళ్ళు యావత్తు తోడించుకొని అతని



నూతిని అతనికి ఖాళీచేసి యివ్వు" అని జడ్జీ తీర్పు చెప్పాడు.

ఈ తీర్పు విని పుల్లయ్య తెల్లబోయాడు. తన గడుసుతనానికి తగినట్లుగానే బుద్ధి చెప్పారని గ్రహించి, "బాబూ! నుయ్యి, నూతిలో నీరూ కూడా నీవే. ఈ రోజు మొదలు నూతివిషయంలో నీజోలికి రాను. కోర్టువారు బాగా బుద్ధిచెప్పారు" అని కోర్టు వారి తీర్పుప్రకారం బాపనయ్యకు అరవై రూపాయలు దర్శించుకున్నాడు.

చూశారా! పుల్లయ్య అతి గడుసుతనం అరవైరూపాయలతో అణిగింది.



పాపలూ! పై బొమ్మలో పాపం కుందేలు దాని పిల్లల్ని రెంటిని పోగొట్టుకున్నది. కంగారూలు వాటిని ఎత్తుకుపోయి వొళ్లో దాచుకున్నవి. మీరు వాటిని వెదికి కుందేలుకు వప్పగిస్తారూ?

## ముగ్గులు









# మూడు బొమ్మలు

**అనగా** అనగా ఒక రాజకుమారుడు. ఆ రాజకుమారునికి వయసు వచ్చాక, ప్రపంచమంతా తిరిగి వింతలు, విశేషాలు తెలుసుకోవాలని కుతూహలము కలిగి, దేశాలమీద వెళ్తున్నాడు.

అలా వెళ్తూండగా ఒక ఊరు అడ్డు వచ్చింది. ఆ ఊరిలో ఆ రాజకుమారుడు చూసిన వింత ఏమంటే – ఏ చెట్టున చూసినా, ఏ గోడన చూసినా ఏ మేడన చూసినా మూడు బొమ్మలు కనిపించాయి. మొదటి చిత్రపటము ఒక అందమైన ఆడ పిల్ల బొమ్మ; రెండోదాంట్లో ఆ అమ్మాయి ఒక మగవానితో పరుగెత్తుతుంటుంది. మూడవ చిత్రపటాన్ని రెండు భాగాలు చేసారు. పైభాగములో వెనుకటి బొమ్మలో పరుగెత్తుతున్న మగవానికి ఉరివేస్తుంటారు. క్రిందిభాగములో అతనికే ఆ అమ్మాయి పూలమాల వేస్తుంటుంది. కొత్తగా వచ్చిన రాజకుమారునికి ఈ బొమ్మలేమిటో అర్థము కాలేదు.

ఆ రాత్రికి ఆ ఊర్లోని పేదరాసి పెద్దమ్మ ఇంటిలో బస ఏర్పాటుచేసుకున్నాడు రాజకుమారుడు. పేదరాసి పెద్దమ్మ 'ఏ ఊరు' మొదలైన ప్రశ్నలన్నీ వేశాక, రాజకుమారుడు తను చూసిన వింతను చెప్పి 'ఏమిటవ్వా; ఈ విశేషము?' అని అడిగాడు.

"అదా, నాయనా" అని యిలా చెప్పటము మొదలెట్టింది పెద్దమ్మ.

"ఈ ఊరి రాజుగారికో కూతురున్నది. ఆమె రంభనిమించే అందగత్తె. ఆమెకి రాజుగారు చిన్ననాటి నుండి కత్తిసాము, వేట మొదలైనవన్నీ నేర్పాడు. ఆమెకి పెళ్ళంటే ఇష్టము లేదు. కాని, రాజుగారి మనసు కష్టపడుతుందేమోనని పెళ్లి చేసుకుంటానన్నది. ఎవరినంటే, తనను పరుగుపందెములో ఓడించినవారిని.

గొల్లమూడి లక్ష్మినారాయణ, గుంటూరు



"ఇప్పటికి అనేకమంది ఆమెని పెళ్ళి చేసుకుందామని వచ్చారు. కాని అది ఏమి మహత్తోకాని ఆమె నెవరూ ఓడించలేక పోయారు. పందెములో ఆమె ఒక షరతు పెట్టింది. అది ఏమంటె పందెములో ఓడిపోయినవారికి ఉరిశిక్ష. పందెములో ఆమెని ఓడిస్తే, ఆమెని పెళ్లాడవచ్చు.

"ఇప్పటికి నీకు తెలిసిందనుకుంటాను ఆ మూడుబొమ్మల అర్థము. మొదటిబొమ్మ రాజకుమార్తె. రెండోబొమ్మలో ఆమెతో పందెములో పాల్గొనటము. మూడవదానిలో పైభాగములో ఓడిపోతే ఉరిశిక్ష క్రింది భాగములో పందెములో ఆమెని గెలిస్తే ఆమెని పెళ్లిచేసుకుంటా రని."

పేదరాసిపెద్దమ్మ ఇలా చెప్పేసరికి రాజకుమారునికి మనసు మనసులోలేదు. అతను ఏమైనాసరే ఆమెని పెళ్ళిచేసుకు తీరాల్సిందేనని నిశ్చయించుకొన్నాడు.

మరి, ఆమె నెలా పెళ్లిచేసికోవాలో ఏమో తోచక అలా షికారుకు బయలు దేరాడు. ఆలోచిస్తూ, ఆలోచిస్తూ, రాజకుమారుడు తనకు తెలియకుండానే అడవి లోనికి ప్రవేశించాడు. తల ఎత్తి చూస్తే చుట్టూ అడివి. కొద్దిదూరములో కొన్ని పక్షులు వలలో చిక్కుకుని ఉన్నాయి. బోయవాడు ఎక్కడికి వెళ్ళాడో మరి, ఆ చుట్టుప్రక్కల లేడు. రాజకుమారుడు పోయి వాటిని విడిపించి తన దారిన తను తిరిగివస్తూంటె 'ఓ రాజకుమారా!'అన్నాయి పక్షులు. ఆశ్చర్యపోయి వెను దిరిగి చూశాడు రాజకుమారుడు.

"నీవు మాకు చేసిన ఉపకారాన్ని మేము ఎన్నటికీ మరవము. ప్రత్యుపకారం చేద్దామంటే ప్రస్తుతము మా దగ్గిరేమీ కానుకలు లేవు. మా రాజుగారి దగ్గిరికిరా. బహుమానమిప్పిస్తా"మన్నాయి పక్షులు,

యువరాజు పక్షులకున్న ప్రత్యుపకార బుద్ధికి సంతోషించి, పక్షులవెంట పక్షిరాజు వద్దకి వెళ్లాడు.

మంత్రి సామంతులంతా పరివేష్టించి ఉండగా దర్బారుతీర్చి కూర్చున్నాడు పక్షి సామ్రాట్. పక్షులన్నీ రాజకుమారుడి గురించి ఎంతో ఎంతో చెప్పగా విని సంతోషించి పక్షిరాజు ఏమి వరము కావాలి కోరుకోమని రాజకుమారుడ్ని అడిగాడు.

రాజకుమారుడు తలవంచుకుని ఆలోచించాడు. అలా ఆలోచించగా అతని బుర్రకు తళుక్కున తట్టింది రాజకుమార్తె ఆలోచన. వెంటనే రాజకుమారుడు "ఓరాజా! నాకేమీ కోరికలు లేవు కాని, ఒక్కటిమాత్ర ముంది. అది తమరు తీర్చాలి మహాప్రభూ! ఇక్కడికి పదిమైళ్ళ దూరములో ఒక రాజుగారున్నారు. ఆ రాజుగారి కూతుర్ని నేను పెళ్లిచేసుకో దలచాను. కాని ఒక అడ్డంకు మాత్ర ముంది. ఆమెని పెళ్లిచేసుకోవాలంటే ఆమెని పరుగు పందెములో ఓడించాలట. ఆమెని ఇంతవరకూ ఎవరూ ఓడించ లేకపోయారు. ఉపాయము చెప్పండి, మహారాజా!" అని అడిగాడు



పక్షిరాజు కాసేపు ఆలోచించి, రెక్కల్ని విదిలించి "రాజకుమారా! అసాధ్యమైన కోరికే కోరావు. కాని ఏమిచేస్తాం? మీ మానవులలా అడితప్పేరకము కాదోయ్ మేము! ఆమెను పందెములో ఓడించటం కష్టం. దానికి ఒక్కటే మార్గముంది. సప్త మహాసముద్రాలు దాటాక ఒక దీవి కాన వస్తుంది. ఆ దీవి నడిమధ్యలో ఒక కొల నుంది. ఆ కొలను అట్టడుగున పాతాళ లోకానికి సొరంగముంది. ఆ సొరంగము గుండా వెళ్తే ఒక మహా భయంకరమైన చోట రెండు చెప్పులు వేళ్ళాడ కట్టి




"వుంటాయి. వాటిని తొడుగుకొని పరుగెత్తితే నీవు ఆమెని ఓడించగలవు." అన్నాడు.

"అంత కష్టమయిన పనిని నేనెలా చేయగలను స్వామీ! ఆ పని గూడా తమరే చేసి పెట్టాలి." అని జాలిగా ప్రార్థించాడు యువరాజు.

పక్షిరాజుకు దయకల్గి "అయితే మా సేనాధిపతిని పంపిస్తాము. ఆ దీవిలో నిన్ను దింపి చక్కా తిరిగివస్తాడు. మా సేనాధిపతికి ఇక్కడ చాల పని ఉంటుంది. అంచేత నిన్ను తిరిగి తీసుకు రావటానికి వీలులేదు." అని చెప్పాడు.

"అదే పదివేలు" అన్నాడు యువరాజు.



రాజకుమారుడు పక్షుల సేనాధిపతిపై ఎక్కి కూచున్నాడు. 'రుయ్, రుయ్' మంటూ, ఆకాశములోకి ఇట్టె ఎగిరి పోయి విమానముకన్నా తొందరగా ప్రయాణము సాగించాడు సేనాధిపతి. కన్నుమూసి కన్ను తెరచేలోపల సప్తసముద్రాలు దాటి ద్వీపంలో దిగారు సేనాధిపతీ, యువరాజు. సేనాధిపతి తిరిగి వెళ్లిపోయాడు.

యువరాజు ఆ దీవంతా కలయ వెదకాడు. ఒక రాక్షస స్త్రీ కనిపించింది. ఆమె ఇవీ అవీ మాట్లాడి తనను పెళ్ళి చేసికోమని బలవంత పెట్టింది. తను వచ్చినపని చెప్పి, ఆ పని పూర్తయ్యాక పెళ్లి చేసుకుంటానని నమ్మించాడు. ఆమె ఒక పసరు ఇచ్చి, అది శరీరానికి రాసుకుంటే నీటిలో ఏమీ అపాయముండదని, కళ్లుమూసుకున్నా సర్వమూ కనిపిస్తుందనీ చెప్పింది. అలాగే పసరు రాసుకొని, కొలనులోనికి దూకి, అట్టడుగునకు పోయి చూస్తే సొరంగములాంటి దొకటి కనిపించింది. దానికి తలుపు ఒకటి అడ్డముంది. ఏమిచేయాలా అని ఆలోచిస్తూ ఇటూ అటూ పచార్లుకొడుతుంటే దానంతటది తలుపు తెరచుకుంది. ఏమిటా అని చూస్తే అతని కాలిక్రింద కలువకాడ వంగిఉంది. కాలెత్తితే కలువకాడ లేచింది. తలుపు మూసుకుంది. రహస్యము కనుగొని, కలువకాడ వంచి,



సొరంగం గుండా ప్రయాణం చేయటం మొదలుపెట్టాడు. దారి అంతా చీకటిగా వుంది. అలాగే తముడుకుంటూ పోగా, పోగా అకస్మాత్తుగా వెలుతురువచ్చింది. ఎదురుగా వాకిలిప్రక్కగా ఒక ముసలి రాక్షసుడు కునికిపాట్లు పడుతున్నాడు. వాడు నిద్రపోతూనే మీసాలు దువ్వుకుంటున్నాడు. కొండవీటి చేంతాడులా ఉన్నాయి వాడి మీసాలు. వాడి పేరు 'మీసాలరాక్షసుడు.' రాజకుమారుడు మెల్లిగా వాడిదగ్గిరికి వెళ్లాడు. మీసాలు దువ్వితే వాడికి బాగా నిద్రపట్టుందని గ్రహించి మెల్లగా మెత్తగా దువ్వాడు వాడి మీసాలను.




మెల్లగా లోపలికి వెళ్లాడు. అలా వెళ్లంగా, వెళ్ళంగా ఒక గుహ ఒకటి అడ్డు అడ్డువచ్చింది. అక్కడొక రాక్షసుడు మెల్లిగా అటూ ఇటూ తిరుగుతున్నాడు. ఆ గుహ చాలా భయంకరంగా ఉంది. చేతిలో కత్తిపట్టుకొని నిద్రపోతూనే కాపలా కాస్తున్నాడు ఆ రాక్షసుడు. వాడిపేరు 'బండనిద్ర రాక్షసుడు.' ఆ గుహ మధ్యలో రెండు చెప్పులు పక్షిరాజు చెప్పినట్లుగానే కీలలాగ కట్టబడియున్నాయి. నడిచివెళ్తా మంటే క్రింద నేలమీద బుసకొట్టుతూ పాములు పాకుతున్నాయి. తేళ్లు, మండ్రగబ్బలు తిరుగుతున్నాయి, రాక్షసుణ్ణి అయితే కరవవుగాని రాజకుమారుణ్ణి కరుస్తాయిగా అవి. అందుచేత ఏమి చేదామా అని ఆలోచించి ఒక గూడు ఎక్కి, రాక్షసుడు అక్కడికి వచ్చినపుడు వాడి బుజాలమీదికి ఎక్కి కూచున్నాడు. వాడికి మెలకువవస్తే వెంటనే తల తెగగొట్టాలని కత్తి సిద్ధముచేసుకున్నాడు కాని, వాడు బండనిద్ర రాక్షసుడాయె. వాడికి మెలకువరాలేదు. సరిగ్గా గుహమధ్యకు వచ్చేసరికి రాజకుమారుడు చెప్పులను అందుకొన్నాడు. మళ్ళా గూటిదగ్గిరికి రాక్షసుడు వచ్చినపుడు గూట్లోకి దూకాడు రాజకుమారుడు.



అ చెప్పులు తీసుకొని మళ్లా తిరిగి వస్తూండగా దారిలో ఒక రాక్షసుడు సారాయి త్రాగుతూ కూచున్నాడు. అప్పటికే వాడికి బాగా మత్తెక్కి ఉంది. వాడిపేరు ఏమిటో తెలుసా? 'సారాయి రాక్షసుడు' వాడి పేరు. రాజకుమారుడు వెళ్ళి రాక్షసుడిచేత బాగా సారాయి త్రాగించాడు. 'ఎవర్రా, అబ్బాయి! చాలా మంచి పిల్లవాడి వలె ఉన్నావే ?' అని అడిగాడు రాక్షసుడు.

" నేనే మామా ! నీ అల్లుణ్ణి; నా పేరు సారాయి." అన్నాడు రాజకుమారుడు.

"ఎక్కడుంటున్నావురా నీవు ? " అని అడిగాడు రాక్షసుడు.

"సారాయి రాజ్యములో సారాయి పురములో సారాయి ఇంట్లో ఉంటున్నాను మామా! మా ఇంట్లో సారాయి చాలా ఉంది మామయ్యా! వస్తావా? తీసుకెళ్తాను గాని"అని టోకరా వేశాడు రాజకుమారుడు.

" ఆఁ వస్తానురా. ఇక్కడ సారాయి కోసము మొహము వాచిపోయాను. మీ సారాయి పురానికి వస్తే మీ ఇంట్లో ఉండే సారాయి బావిలోనే కాపురముంటా నేను."

ఇలా టోకరా వేశాక సారాయి రాక్షసుడి భుజాలమీదికి ఎక్కి కూచున్నాడు రాజకుమారుడు. రాజకుమారుడు దారి చూపిస్తే, సప్తసముద్రాలు దాటి రాక్షసుడు రాజకుమార్తె ఊళ్ళో కాలు పెట్టాడు! అప్పుడు రాజకుమారుడు "మామా, మామా! ఇప్పుడైతే, అంతా నిన్ను చూస్తారు. రాత్రికి రహస్యముగా మా ఇంటికి వద్దువుగాని. అంతదాకా ఈ ఇంట్లో దాక్కొని ఉండమని చెప్పి ఒక పెంకుటింటిలోనికి తీసుకువెళ్లి బయట గొళ్లెము పెట్టి; నిప్పంటించాడు. పాపం, రాక్షసుడు 'ఒరేయ్! సారాయ్. సారాయ్ !" అని అరచి అరచి చనిపోయాడు.

తను తెచ్చిన ఆ వింత చెప్పులు తొడుగుకొని రాజకుమార్తెను పందెములో ఓడించాడు రాజకుమారుడు. అప్పుడు రాజకుమార్తె రాజకుమారుణ్ని పెళ్ళాడింది.

రాజకుమారుడు వెంటనే ఏమి చేసాడంటే పూర్వము ఎక్కడబడితే అక్కడ కట్టబడిన ఆ మూడు బొమ్మలు తీసివేయించి రాజకుమారునికి, రాజకుమార్తె పూలమాలలు వేస్తున్నట్లుగా ఉన్న చిత్రపటాలను రాజ్యమంతటా కట్టించాడు.



# పెద్ద దిక్కు

అనంగనంగ ఒక వూళ్లో బ్రాహ్మణ దంపతులు వుండేవారు. బ్రాహ్మడి భార్య, పాపం వట్టి అమాయకురాలు. ఎప్పుడూ ఏదో ఒక తెలివి తక్కువపనిచేసి భర్త చేత చీవాట్లు తినేది. "ఇలాటి తెలివి తక్కువ పెళ్లాన్ని కట్టుకున్నానే" అని బ్రాహ్మడు తనని తాను తిట్టుకుంటూ ఎలాగో సంసారం సాగిస్తున్నాడు.

ఆ సంవత్సరం, వేసంకాలం వచ్చే ముందే రెండునెల్లకు సరిపోయేట్లుగా, ఉప్పు, చింతపండు, మెరపకాయలు, కందులు, పెసలు, మినుములు, ఒకటేమిటి యింటికి కావలసిన వెచ్చాలన్నీ తెచ్చిపడేసి, "ఒసే! చైత్ర, వైశాఖాలు వస్తున్నయ్యి. అప్పుడు ఎండల్లో పోయి తేవటం కష్టమని కావలసిన వెచ్చాలన్నీ తెచ్చాను. అన్నీ యిప్పుడే వాడెయ్యకు, నేను మళ్లీ తేలేను" అని భార్యతో చెప్పాడు బ్రాహ్మడు.

చైత్ర వైశాఖాలంటే ఎవరో మనుష్యులనుకుంది ఆ వెఱ్ఱి బాగుల్ది. "అలాగే వుంచుతాలెండి" అంది. ఆరోజు మొదలు "చైత్ర వైశాఖాలు ఎప్పుడు మనింటికి వస్తారా, ఎప్పుడు ఈ సరుకులన్నీయిచ్చి పుణ్యం కట్టుకుంటానా" అని వీథుల్లో ఎదురు చూడసాగింది బ్రాహ్మడి భార్య.

ఇలా వుండగా బ్రాహ్మడు ఏదో పనిమీద ఆ ప్రక్కవూరికి పోవలసి వచ్చింది. వూరికి పోబోతూ భార్యని పిలిచి, "ఒసేవ్! నేను తెచ్చిన సరుకులన్నీ వాడేవ్ సుమా. చైత్ర వైశాఖాలువస్తయ్" అని చెప్పిపోయాడు.

ఈ సంగతి బ్రాహ్మడి పక్కింట్లోవున్న యిద్దరు కాపులు విన్నారు. బ్రాహ్మడి భార్య వట్టి తెలివితక్కువదని వాళ్ళకికూడా తెలుసు. అందుచేత బ్రాహ్మడు వూరికి వెళ్లిన మర్నాడు, కాపు లిద్దరూ, కావిళ్లు వేసుకుని బ్రాహ్మడింటికి వచ్చారు. వచ్చి, "మేము చైత్ర వైశాఖాలము. నీ భర్త

కె. శేషుప్రభ, మద్రాసు




మాకు వెచ్చాలు యిస్తానని చెప్పాడు, పట్టుకుపోదామని వచ్చాం" అన్నారు.

అమాయకురాలైన బ్రాహ్మడి భార్య పాపం, వాళ్లు చెప్పింది నిజమేనని నమ్మింది. వాళ్లిద్దరినీ పీటవేసి కూర్చోపెట్టి, సరుకులన్నీ వాళ్లకి దర్శించుకుని పంపింది.

మరి నాలుగు రోజులకి బ్రాహ్మడు తిరిగి వచ్చాడు. భర్తని వాకిట్లో చూడగానే, "ఏమండోయ్! మీరు చెప్పిపోయినట్లే చైత్ర వైశాఖాలు మనింటికి వచ్చారు. మీరు వచ్చేదాకా వాళ్ళని అపట మెందుకని, మీరు వాళ్ళకోసం తెచ్చిన వెచ్చాలన్నీ యిచ్చి పంపాను." అని చెప్పింది.

బ్రాహ్మడు తెల్లబోయాడు. "ఓసి నీ తెలివి మండా. చైత్ర వైశాఖా లేమిటీ, మనింటికి రావటమేమిటీ. చైత్రవైశాఖాలంటే నెలల పేర్లు. ఆ రెండు నెలలూ ఎండాకాలం. అందుకని చైత్రవైశాఖాలు వస్తున్నయ్యని చెప్పాను. ఇదా నువ్వు చేసిన ఘనకార్యం!" అని నాలుగు తిట్టాడు.

* * *

మళ్లీ రోజులు గడవసాగినై. బ్రాహ్మడి భార్య మాత్రం ఏదో ఒక తెలివి తక్కువపని చేసి, భర్తచేత చివాట్లుతినని రోజు లేదు. బ్రాహ్మడికి ప్రాణం విసిగెత్తింది. "మన కొంపలో పెద్ద దిక్కు అంటూ ఒకటి లేకపోవటంచేతనే నీ బుద్ధి యిలా బుగ్గి అవుతోంది. పెద్దదిక్కంటూ ఒకటి కొంపలోవుంటే నీ ఆటలు యిలా సాగుతయ్యా" అని కసురుకున్నాడు.

ఇది వినగానే బ్రాహ్మడి భార్య ఆలోచన్లో పడింది, 'పెద్ద దిక్కు' అంటే ఏమిటా అని. ఎలాగైనా ఒక 'పెద్దదిక్కు'ని తను సంపాయించ గలిగితే భర్తచేత చివాట్లు తప్పునుగదా అనుకుంది. ఇంటికి వచ్చేపోయేవారితో నల్లా "మాయింట్లోకూడా ఒక పెద్దదిక్కు వుంటే ఎంత బాగుండును" అని అనాటినించీ అంటూవుండేది.

ఇది తెలిసి బ్రాహ్మడి భార్యని మోసగించాలని ఒకడు తట్టనిండా గడ్డితో చేసిన బొమ్మల్ని పెట్టుకొని "పెద్ద దిక్కో యమ్మ, పెద్ద దిక్కు" అని కేక వేసుకుంటూ బ్రాహ్మడి యింటి ముందుగా పోయాడు. ఈ కేక వినంగానే బ్రాహ్మడి భార్యకి ప్రాణం లేచివచ్చింది. వెంటనే

ఆ అబ్బిని పిలిచి బేరంచేసింది. ఒక్కో పెద్దదిక్కు రెండువందలు అన్నాడు అతను. "అమ్మ బాబోయ్! రెండువందలు ఎక్కడ్నించి తేగలను? కావలిస్తే యిదుగో నా మెళ్లో ఈ బంగారపుగొలుసు యిస్తాను పట్టుకెళ్ళు" అంది.

ఆ వచ్చినతను "సరే అలాగే తీసుకోవమ్మా" అని నిక్షేపంలాంటి ఆ బంగారు గొలుసు పుచ్చుకొని ఒక 'పెద్ద దిక్కు' యిచ్చి తనదారిన తాను పోయాడు.

ఈ గొడవంతా జరిగేటప్పుడు బ్రాహ్మడు యింటిదగ్గిరలేడు. బ్రాహ్మడి భార్య తాను కొన్న పెద్ద దిక్కుకి అలంకారంచేసి, పసుపూ కుంకంపెట్టి పూజచెయ్యటం మొదలెట్టింది. ఇంతలోకే బ్రాహ్మడు యింటికి తిరిగి వచ్చాడు. భర్తని చూడటంతోటే పూజచేస్తున్న బ్రాహ్మడి భార్య, చివాలున లేచి. "ఏమండీ, పెద్ద దిక్కులేదో, పెద్ద దిక్కు లేదోఅని రోజూ కసురుకుంటున్నారని నా మెళ్ళో గొలుసు యిచ్చి ఒక పెద్ద దిక్కుని కొన్నాను." అని తను కొన్న గడ్డిబొమ్మని చూపింది.

బ్రాహ్మడు నిలువునా నీరైపోయాడు. "ఓసి దౌర్భాగ్యపుదానా. నీతో ఇంకెలా కాపురం చేసేది. నిక్షేపంలాంటి బంగారు గొలుసు కాస్తా వాడెవడి మొహానో పెట్టి ఈ గడ్డిబొమ్మనా కొన్నావ్! ఇక నువ్వు నా ఇంట్లో ఒక్క క్షణం వుంటానికి వీల్లేదు. నీ పెద్దదిక్కూ, నువ్వూ కలిసి ఎక్కడైనా వూరేగండి" అంటూ భార్యని తరిమేశాడు.




పాపం, బ్రాహ్మడి భార్య ఏంజేస్తుంది? తన తెలివితక్కువ తనానికి తనని తాను తిట్టుకుంటూ, పెద్దదిక్కుని తీసుకుని తన పుట్టినింటికి బయలుదేరింది.

అలా పోతూండగా ఒక అడవి వచ్చింది. ఇంతలో చీకటి పడింది. ఆ చీకట్లో ప్రయాణంసాగిస్తే ఏ పులో గిలో మీదపడి చంపుతుం దని, బ్రాహ్మడి భార్య అక్కడే ఒక చెట్టుమీద ఎక్కి కూర్చుంది.

నడిరాత్రివేళ కొంతమంది దొంగలు సరిగ్గా ఆ చెట్టుకిందికే వచ్చి తాము దొంగిలించిన సొత్తు భాగాలు పంచుకోసాగారు. వాళ్ళని చూడగానే చెట్టుమీద వున్న

బ్రాహ్మడిభార్యకి గుండెలు దడదడ కొట్టుకో సాగినై. చేతులూ కాళ్ళూ వణకసాగినై. అమె చేతిలో వున్న పెద్ద దిక్కు కాస్తా చటుక్కునజారి దొంగలమధ్య పడింది.

అ చీకట్లో పెద్దచప్పుడుతో ఏదో తమ మధ్యపడేసరికి దొంగలు, అదేదో దయ్యమో భూతమో నని జడిసి, ఇక అక్కడవుంటే ప్రాణాలు దక్కవని తాము దొంగిలించి తెచ్చిన సొమ్ములూ, ధనంఅంతా అక్కడే వదిలి,వెనక్కి చూడకుండా పారిపోయారు.

తెల్లవారింది. బ్రాహ్మడిభార్య చెట్టుమీది నించి దిగింది. దొంగలు అక్కడ వదిలి వెళ్లిన ధనం, నగలూ చూసి ఆశ్చర్య పోయి, అవన్నీ మూటకట్టుకుని, మళ్లీ తన 'పెద్దదిక్కు'తో సహా భర్తదగ్గిరికిచేరుకుంది.

అక్కడ జరిగిన దంతా భర్తతో చెప్పి, "ఇదంతా నేను కొన్న పెద్దదిక్కు మహత్యమే. నేను మిమ్మల్ని ఎన్నోవిధాల నష్టపెట్టినమాట నిజమే ననుకోండి. అయినా, దానికి మరి నాలుగురెట్లు సంపాయించుకొచ్చాను చూడండి"అంటూ తను తెచ్చిన ధనమూ, నగలూ చూపింది. బ్రాహ్మడు సంతోషించాడు. ఆ నాటినించీ బ్రాహ్మడి భార్యకూడా జాగ్రత్తగా,ఆలోచించి పనులు చేస్తూ లక్షణంగా కాపురం చేస్తోంది.

ఇందులో ఎవరి తెలివితేటలు మాత్రం ఏమున్నై, ఏదో ఆ 'పెద్దదిక్కు' వచ్చిన వేళ మంచిది కనక అలా అదృష్టం కలిసి వచ్చింది కాని!






అనగా అనగా ఒక దేశాన్ని ఒక రాజూ రాణీ పరిపాలిస్తూ వుండేవాళ్లు. వాళ్లకి సంతానం కలగలేదు. వారసులు లేకుండానే చనిపోవలసి వస్తుందేమోనని వాళ్లు చాలా దిగులుపడ్డారు. వాళ్లు మ్రొక్కని దైవం, చెయ్యని పూజాలేదు. ఇక యజ్ఞాలకీ, యాగాలకీ, బైరాగి చిట్కాలకీ, అంతే లేదు. ఇన్ని చేసినా, పాపం వారికి సంతానం కలగలేదు.

ఆ రాజు తన యితర సిబ్బందితోపాటు ఒక ఆడగుఱ్ఱాన్నీ, ఒక ఆడ కుక్కని కూడా పెంచుతున్నాడు. ఆ రెంటియందూ రాజుకీ, రాణికీ మిక్కలి ప్రేమ. అదేం చిత్రమోగాని ఆ రెండింటికి కూడా ఎంత కాలానికీ సంతానం కలగలేదు. రాజుకీ, రాణీకీ తమ సంగతీ వాటి సంగతీ చూసేసరికి చాల దుఃఖం వచ్చింది.

చివరికి ఒకరోజున రాజు తన రాజ్యంలోనూ ఆ చుట్టుప్రక్కలవున్న రాజ్యాలలోనూ యిలా చాటింపు వేయించాడు — "తనకీ, తను పెంచుతున్న గుఱ్ఱానికీ, కుక్కకీ సంతానం కలిగే ఉపాయం చెప్పిన వారికి గొప్ప బహుమతి యిస్తాను" అని.

ఈ చాటింపువిని, ఒక భూతవైద్యులేనా, మంత్రగాళ్లేనా, బైరాగులేనా, ఎంతో మంది వచ్చారు. ఒకరు రక్షరేకు కట్టిపోయారు, మరొకరు ఏదో భస్మం మంత్రించి యిచ్చారు, యింకొకరు ఏవో మంత్రాలు పఠించమన్నారు, మరొకరు ఏవో యజ్ఞాలు యాగాలు చెయ్యమన్నారు. ఇలా రకరకాలుగా, ఎవరికి తోచినట్లు వాళ్లు చేసిపోయారు. రాజు ఆశతో అన్నీ చేసి చూచాడు. కాని ఏమీ ఫలితం కనిపించకపోయేసరికి చాల నిరాశచెందాడు.

బి. వేణుగోపాల్, మద్రాసు



ఇది జరిగిన ఒక వారం రోజులకి రాజుగారిని చూడటానికి ఒక సన్యాసి వచ్చి సంతానం కలగటానికి తను ఒక ఉపాయం చెబుతానన్నాడు. రాజుకి అప్పటికే సన్యాసులంటే కొంచెంకూడా నమ్మకం లేకుండాపోయింది. కాని 'ఏ పుట్టలో ఏ పాముందో!' అనే ఆశ చొప్పున సన్యాసిని లోపల ప్రవేశపెట్టమన్నారు.

సన్యాసి రాజు ఎదుటికివచ్చి, "రాజా! నేను మీకు తొమ్మిది మాత్రలు యిస్తాను. ఒక్కొక్కరికి మూడేసి మాత్రల చొప్పున రాణికీ, గుఱ్ఱానికీ, కుక్కకీ, వేయించండి. మూడు నెలలు పూర్తిఅయేసరికి రాణీ, ఒక చక్కటి మగపిల్లవాణ్ణి కంటుంది. గుఱ్ఱానికి ఒక పిల్ల పుడుతుంది. కుక్కకి ఒక పిల్ల పుడుతుంది. ఆ రోజు మొదలు మళ్లీ ఒక నెల పూర్తికాగానే అలాగే ముగ్గురికీ సంతానం కలుగుతుంది. ఇంకోనెల పూర్తిఅయేసరికి మళ్లీ అదే విధంగా ముగ్గురికీ సంతానం కలుగుతుంది. మొత్తంమీద, ఈ మాత్రలు వేసుకున్న రోజు మొదలు అయిదు నెలలు పూర్తిఅయేసరికి మీకు ముగ్గురు కుమార్లు కలుగుతారు. గుఱ్ఱానికి మూడు పిల్లలు పుడతై. కుక్కకి మూడు పిల్లలు పుడతై. ఇలా కలిగిన మీ అందరి సంతానం మూడేళ్లు పూర్తయేసరికి పెరిగి పెద్దవుతారు. కాని...."అని యింకేమో చెప్పబోయినాడు.

ఇంతవరకూ, సన్యాసి చెబుతున్న సంగతులు అరటిపండు వొలిచి చేతులో బెట్టినట్లుండటంచేత రాజు ఆశతో నోరు తెరుచుని వింటున్నాడు. సన్యాసి 'కాని' అనే

సరికి రాజు ఒక్కసారిగా ఖంగారుపడి, "కాని ఏమిటి?" అని అడ్డుతగిలాడు.

"మరేమీలేదు. పైన చెప్పినప్రకారం ఒక్కొక్కరికి ముగ్గురు చొప్పున సంతానం కలుగుతుందికదా. నేను మళ్లీ మూడేళ్లు పూర్తికాగానే మీ దర్శనానికి వస్తాను. అప్పుడు మీ కొమారులలో ఒకరినీ, గుఱ్ఱపిల్లల్లో ఒకదాన్నీ, కుక్కపిల్లల్లో ఒకదాన్నీ నాకు యివ్వాలి. ఏ కొమారుణ్ణి, ఏ గుఱ్ఱప్పిల్లని ఏ కుక్కపిల్లని యిచ్చినా నాకిష్టమే. ఇందుకు మీరు ఒప్పుకుంటే నేను మీకు మాత్రలు యివ్వగలను" అన్నాడు సన్యాసి.

"ఇంతేకదా! నీ చలవవల్ల సంతానం కలగాలేగాని నీ కివ్వటానికి మాకేమి అభ్యంతరం ఉంటుంది? అదీగాక ఒక్కొక్కరినేగదా నీవు అడిగింది. ఆ ఒకరుకూడా మాయిష్టం వచ్చినవాళ్లనే యివ్వమంటివి! అందువల్ల, నీ కోరిక ప్రకారం మూడేళ్ల తర్వాత వచ్చి ముగ్గురినీ తీసుకుపోవచ్చు" అన్నాడు రాజు. సన్యాసి తొమ్మిది మాత్రలు రాజుకిచ్చి పోయాడు.



సన్యాసి వెళ్ళగానే రాజు మూడు మాత్రలు రాణీకిచ్చి, మిగతావి మూడు గుఱ్ఱానికి, మూడు కుక్కకీ వేయించాడు.

* * *

మూడు నెలలు ఎప్పుడు పూర్తి అవుతయ్యా అని రాజు రోజులు లెక్కబెడుతూ కూచున్నాడు. చివరికి మూడో నెల పూర్తి అయిన మర్నాడు రాణీకి ఒక చక్కటి మగపిల్లవాడు పుట్టాడు. గుఱ్ఱానికి ఒక పిల్ల పుట్టింది. కుక్కకీ ఒక పిల్ల

పుట్టింది. రాజుకి పట్టలేనంత సంతోషం కలిగింది.

రాజు మళ్లీ రోజులు లెక్కపెట్టటం మొదలెట్టాడు, నెల ఎప్పుడు పూర్తి అవుతుందా అని. నెల రోజులు యిట్టే గడచిపోయినై. మళ్లీ రాణీకి పిల్లవాడు పుట్టాడు. గుఱ్ఱానికి పిల్ల పుట్టింది. కుక్కకి పిల్ల పుట్టింది. మరో నెల పూర్తి అయేసరికి సన్యాసి చెప్పివెళ్లిన ప్రకారం మూడోసారి అదే విధంగా రాణీకీ, గుఱ్ఱానికీ, కుక్కకీ సంతానం కలిగాయి.

ఇప్పటికి రాజుకి పూర్తిగా సంతోషం కలిగింది. తన రాజ్యం అంతటా ఈ శుభవార్త చాటింపువేయించాడు. ఒక దానాలేనా, ధర్మాలేనా, ఉత్సవాలేనా, విందులేనా, ఎంతో వైభవంగా జరిపించాడు.

రోజులు గడచినకొద్దీ రాజు ముగ్గురు కుమార్లూ త్వర త్వరగా పెరగసాగారు. వాళ్ళతోపాటే గుఱ్ఱప్పిల్లలూ, కుక్కపిల్లలూ కూడా పెరగసాగినై. రాజుకి సంతోషంతో పాటు పెద్ద దిగులుకూడా పట్టుకుంది. "మూడేళ్లు పూర్తికాగానే ఆసన్యాసి వస్తాడు. నేను ఒప్పుకున్న ప్రకారం అతనికి నా ముద్దుల కొడుకునీ, గుఱ్ఱప్పిల్లనీ, కుక్కపిల్లనీ యివ్వాల్సి వస్తుందే!" అని.

ఇదివరకల్లా రోజులు లెక్కపెడుతూ వచ్చిన రాజు యిప్పుడు మూడేళ్లు త్వరగా గడవకుండా వుంటే బాగుండునే అనుకోటం మొదలుపెట్టాడు. కాని కాలం ఆగుతుంది గనకనా? చూస్తుండగానే మూడేళ్లూ యిట్టే గిఱ్ఱున తిరిగిపోయినై.

[ఇంకా వుంది]






కలవారి అమ్మాయికి కాసుల్లదండ
పేదవా రమ్మాయికి గవ్వల్లదండ
కాసుల్లదండేలో గవ్వదండల్లో
గవ్వల్లదండకే గారవము మెండు!

కలవారి అమ్మాయికి కందిపప్పు బువ్వ
పేదవా రమ్మాయికి పెద్దవరిగంజి
పప్పు బువ్వాలోను వరిగంజిలోను
వరిగంజి బువ్వకే వచ్చింది రూచి!

కలవారి అమ్మాయికి సిల్కుబట్టల్లు
పేదవా రమ్మాయికి నూలుబట్టల్లు
సిల్కుబట్టల్లోను నూలుబట్టల్లో
నూలు బట్టల్లకే వచ్చెనందమ్ము!

కలవారి అమ్మాయికి కలదు గర్వమ్ము
పేదవా రమ్మాయికి కలదు వినయమ్ము
గర్విష్టి అమ్మాయికి చదువు కరవాయె
వినయంపు అమ్మాయికి వచ్చె విద్యల్లు!

విద్యలే నమ్మాయి వింతపశువాయె
విద్య నేర్చినబాల వీరబాలాయె!

రచన: కనకం, పెద్దాపురం

## స్వతంత్ర బాలకు
# స్వాగతము

'రంయి- రంయి- రంయి- మంటు
రాటం పాడిందీ
రా, అబ్బాయి! రా, అమ్మాయి,
రమ్మని పిలిచిందీ॥ రై- రై-

ఖద్దరు చొక్కా, ఖద్దరు లాగు
తొడుక్కు రమ్మందీ
ముద్దుగ నెత్తిన గాంధీటోపీ
పెట్టుకు రమ్మందీ॥ రై-రై-

చేలో పండిన ప్రత్తి యేకులు
చేసుకు తెమ్మందీ॥
నూలూ తీసి-నేత నేసే
సాలే కిమ్మందీ॥ రై-రై-రై-

రచన : 'శశిరాజ'

## అంకెల్లో దొంగ



పై బొమ్మలో 1 మొదలు 21 వరకు అంకెలు వున్నై. 1 నుంచి ఆ అంకెల్ని వరుసగా కలంతో కలిపి చూడండి మీకో దొంగ దొరుకుతాడు.

## ఈ "వనములు" విన్నారా?

1. పెద్దమేడ - భవనము.
2. ప్రపంచము - భువనము.
3. సువాసనగల మొక్క - దవనము.
4. గాలి - పవనము.
5. బ్రతుకు - జీవనము.
6. కవిత్వం - కవనము.
7. పడుచుదనము - యౌవనము.

రచన : ఆర్. కొండల్ రావ్, శ్రీకాకుళము.

## జోల పాటలు

సంపాదన : దీవి భానుమతీ దేవి

కృష్ణమూర్తివంటి కొడుకు పుడితేను
కష్టాలు కడతేరు కన్నతల్లులకు.
నిదురలో ప్రాణమ్ము అదురునోయేమో
నిష్టురాలేలమ్మ, కష్టజీవులము.

విద్యలేకుంటేను విభవమ్ము రోత
వినయమ్ము లేకుంటె విద్యలూరోత.
ఆయుస్సుమూడినా, ఆకు చిరిగినా
బ్రతికించు వారెవరు ? అతికించు నెవరు ?

తొల్లింటికాలమ్ము దొడ్డకాలమ్ము
అత్తొచ్చి కోడలుకు దణ్ణమ్ము పెట్టె
చాలు చాలత్తయ్య చాలత్తగారు
నీకొడుకు వెయ్యేళ్లు వృద్ధి కావాలి
నీదుకోడలు పట్టమహిషి కావాలి
నువ్వేళ్లి పంచల్ల పాలుగావాలి!

పుణ్యమ్ము మాయింట పెద్దలకువచ్చు
బుద్ధుల్లు మాయింటి బాలలకువచ్చు
ఆచారము మాయింటి ఆడపడుచులకు
అజ్ఞల్లు మా యింటి కోడళ్లకగును.

ముత్యాలు గప్పించి అత్తంపినారు
చిలవల్ని వేయించి చీరంపినారు
రత్నాలువేయించి రవికంపినారు
అకసానవెళ్లే ఓరామచిలుక
చేడె నీమగవారు యేమి తెచ్చారు ?

## చందమామ పజిల్

(బాషాభివృద్ధికి)

### ఆధారములు

అడ్డము :

1. ఒక ఫిలింపేరు
5. మర్కటములు
6. ఓడ
7. వాన బిందువు
9. మంచికథకి ఇది ఉండాలి
10. కాలుచేతులు

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| 1 సీ | | 2 | మ | 3 | | 4 నం |
| | ■ | | ■ | | ■ | |
| 5 | తు | | ■ | 6 | డ | |
| క | ■ | ■ | ■ | ■ | ■ | ర్ధ |
| 7 | ను | 8 | ■ | 9 | ల్ప | |
| | ■ | | ■ | | ■ | |
| 10 క | | | ర | | | లు |

నిలువు :

1. పూలతోటలో కనబడుతుంది
2. శ్రీకృష్ణ దేవ—
3. ఒకరకం నార
4. ఈశ్వరునికి ప్రియమైన పువ్వులు
8. పొట్టి
9. దయ



## విలువైన ఆస్తి

సంపాదన : శ్రీ రఘురామ్, బెజవాడ

పూర్వము ఒక రాజు ఒక పట్టణాన్ని ముట్టడించి యుద్ధంచెయ్యగా అపట్టణంలో ప్రజలు ఓడిపోయారు. ఆ రాజుకు ఆడ వాళ్ళని చంపటం ఇష్టంలేదు. అందుచేత "అడవారందరు తమకు ముఖ్యముగా విలువైన అస్తులతో రేపు ఉదయము 10 గంటలలోగా నాపట్టణంవదలి వెళ్లిపోవాలి" అని చాటింపించాడు.

మర్నాడు అడవారందరు పెద్ద పెద్ద మూటలతో పట్టణం విడిచి వెళ్లిపోయినారు. ఆ మర్నాడు రాజు "ఇక మన పట్టణంలో మిగిలిన మగవారి నందర్నీ నా ఎదుటికి తీసుకరండి" అని తన భటుల్ని పంపాడు. కాని ఒక మగపురుగు కూడా కనబడితే ఒట్టు. ఆ క్రిందటిరోజు అడవాళ్లు తమతో తీసుకువెళ్లిన మూటల్లోవాళ్లువాళ్ల మగవారే నని పాపం రాజుకేం తెలుసు! రాజు ఆ అడవాళ్ల తెలివికి చాల ఆశ్చర్యపోయాడు. అడవాళ్లకి తమభర్తలేగదా విలువైన ఆస్తి!

## పొడుపు పద్యములు

(సంపాదన : చావలి లీలావతి, చెరుకుపల్లి)

1

నరుడుగాని మరియు నారాయణుడుగాని
బీద గాని మరియు సాదగాని
కుడువగలడె నన్నుగాదని దేనిని ?
చెప్పు నన్ను జూతు, చందమామ !

2

కొండమీదనుండు క్రూరమృగమునైన
దింపగలను యిట్టె యింపుగాను ;
చేతనున్నవరకు జగదీశుడంచును
గౌరవింతు రతని ఘనముగాను ;
నేనుగాక నీకు నేస్తంబు గలదమ్మ
చెప్పునన్ను జూతు, చందమామ !

(జవాబులు ప్రక్క పేజీలో చూడండి.)

### పజిలుకు జవాబు

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| 1 సీ | తా | 2 రా | మ | 3 జ | స | 4 నం |
| తా | ■ | య | ■ | న | ■ | ది |
| 5 కో | తు | లు | ■ | 6 ప | డ | వ |
| క | ■ | ■ | ■ | ■ | ■ | ర్థ |
| 7 చి | ను | 8 కు | ■ | 9 క | ల్ప | న |
| లు | ■ | రు | ■ | రు | ■ | ము |
| 10 క | ర | చ | ర | ణ | ము | లు |



## అబ్బాయిలూ, అమ్మాయిలూ!

పై చదరంలో చాలదార్లువున్నై. చదరం నాలుగుమూలలా నాలుగు ఎడ్లువున్నై. చదరం మధ్యని వున్న పాకకి ఎలాపోవాలో నాలుగు ఎడ్లలో ఒకదానికిమాత్రమే తెలుసు. ఆ ఎద్దు ఏదో కనుక్కోండి.

---

12-వ పేజీలో జెండాలు ఎనిమిదే. కాని పొరపాటున 'తొమ్మిది వున్నై' అని అచ్చయింది. జవాబు: 3, 6 నెంబర్ల జెండాలు రెండూ ఒక రకం. మిగతా ఆరు జెండాలు ఒక రకం. 48-వ పేజీలోని పొడుపు పద్యములకి జవాబు: (1) ఉప్పు, (2) ధనము.




## శరత్‌బాబు రచనలు

| | | | |
|---|---|---|---|
| వాగ్దత్త | [నవల] | 1 | 12 |
| సుభద | ,, | 1 | 8 |
| దేవదాసు | ,, | 1 | 8 |
| పల్లీయులు | ,, | 1 | 8 |
| నవవిధాన్ | ,, | 1 | 0 |
| చంద్రనాథ్ | ,, | 1 | 0 |
| పరిణీత | ,, | 0 | 12 |
| బడదీదీ | ,, | 0 | 12 |
| పతివ్రత | ,, | 0 | 12 |
| హేమాంగిని | ,, | 0 | 12 |
| నిష్కృతి | ,, | 0 | 12 |
| మావారు | ,, | 0 | 12 |
| కాశీనాథ్ | ,, | 0 | 12 |
| మహేశుడు | [కథలు] | 0 | 12 |
| నారీర్ మూల్య | [వ్యాసం] | 0 | 12 |

## డిటెక్టివు నవలలు

| | | | |
|---|---|---|---|
| కడపటిమాట | ,, | 0 | 12 |
| మాయమైన మణిహారం | ,, | 0 | 12 |
| తప్పిపోయిన పెళ్లికూతురు | ,, | 0 | 12 |
| తగినశాస్తి | ,, | 0 | 12 |
| పారిపోయిన యుద్ధఖైదీ | ,, | 0 | 12 |
| దివాలా ఎస్టేట్ | ,, | 0 | 12 |
| అంతులేని ఆశ | ,, | 0 | 12 |

## చక్రపాణి అనువాదాలు

| | | |
|---|---|---|
| నారీద్వేషి [మైత్రా] అనువాదం కథలు | 1 | 8 |
| పరాజయం ,, ,, ,, | 0 | 12 |
| ఉదరనిమిత్తం [నాటకం] | 1 | 0 |
| వల్లభపురం చిట్టడవిలో [రాయ్‌చౌధరి] | 0 | 12 |
| హనుమంతుని స్వప్నం [పరశురాం] | 0 | 12 |
| మెట్టవేదాంతం [వనఫూల్] | 1 | 0 |
| బెంగాలీకథలు [మనోవైజ్ఞానిక కథలు] | 0 | 12 |
| ప్రగల్భప్రేతము [అత్యుత్తమ కథలు] | 0 | 12 |
| పాంచజన్యం [రాజకీయ కథలు] | 0 | 12 |
| డిటెక్టివు [నాటకం] | 0 | 12 |
| లంబకర్ణ [పరశురాం కథలు] | 1 | 0 |

## కుటుంబరావు రచనలు

| | | | |
|---|---|---|---|
| నిలవనీరు [అత్యుత్తమ కథలు] | | 1 | 8 |
| మొండివాడు | ,, | 1 | 0 |
| కాలభైరవుడు | ,, | 0 | 12 |
| వరప్రసాదం | ,, | 0 | 12 |
| కవిరాట్టు [గల్పికలు] | | 0 | 12 |
| కులంలేని మనిషి [నవల] | | 0 | 12 |
| అరుణోదయం | ,, | 1 | 0 |
| మారుపేర్లు | ,, | 0 | 12 |
| నీకేం కావాలి? | ,, | 0 | 12 |
| ప్రణయరోగులు [నాటకం] | | 1 | 0 |

అన్ని హిగిన్‌బాథమ్సు స్టాల్సులోనూ దొరుకుతవి. లేదా మాకు వ్రాయండి.
6-0-0 పుస్తకాలు తెప్పించిన పోస్టు ఖర్చులు మేమే భరించెదము.

యువ బుక్ డిపో

పోస్టుబాక్సు నెంబరు: **1686,** మద్రాసు.

# చందమామ

చందమామ ఏజంట్లకు ప్రోత్సాహకరంగా ఉండటానికి చందమామ కొన్ని ముఖ్య సెంటర్లలో ఎలా అమ్ముతున్నదీ తెలుపుతున్నాము. దీన్ని ప్రోత్సాహంగా తీసుకుని తక్కువ అమ్ముతున్న ఏజంట్లు ఎక్కువ అమ్మెదరని భావిస్తున్నాము.



| | | |
|---|---|---|
| 1. | బెజవాడ | 1,000 |
| | హిగ్గిన్‌బాతమ్స్ స్టాల్ | 600 |
| 2. | తెనాలి | 850 |
| | స్టాల్ | 1,000 |
| 3. | గుంటూరు | 650 |
| | స్టాల్ | 400 |
| 4. | రాజమండ్రి | 800 |
| | స్టాల్ | 540 |
| 5. | మద్రాసు | 1,650 |
| | స్టాల్ | 275 |
| 6. | వాల్తేర్ విశాఖ | 620 |
| 7. | విజయనగరం | 200 |
| | స్టాల్ | 80 |
| 8. | ఏలూరు | 550 |
| | స్టాల్ | 100 |
| 9. | గుడివాడ | 350 |
| | స్టాల్ | 150 |
| 10. | సామర్లకోట | 80 |
| | స్టాల్ | 110 |
| 11. | తుని | 150 |
| 12. | కాకినాడ | 375 |
| 13. | బందరు | 300 |
| 14. | అనకాపల్లి | 280 |
| 15. | నెల్లూరు | 400 |
| | స్టాల్ | 60 |
| 16. | నిడుబ్రోలు | 350 |
| 17. | తాడేపల్లిగూడెం | 150 |
| 18. | భీమవరం | 500 |
| 19. | కడప | 250 |
| | స్టాల్ | 100 |
| 20. | గుంతకల్లు | 100 |
| | స్టాల్ | 100 |
| 21. | జగ్గయ్యపేట | 200 |
| 22. | చీరాల | 300 |
| 23. | పాలకొల్లు | 120 |
| 24. | తిరువూరు | 150 |
| 25. | బొంబాయి | 150 |
| 26. | కలకత్తా | 100 |
| 27. | కంకిపాడు | 100 |
| 28. | బళ్లారి | 100 |
| | స్టాల్ | 40 |
| 29. | భీమడోలు | 100 |
| 30. | చల్లపల్లి | 100 |
| 31. | ద్రోణాచలం | 100 |
| 32. | నంద్యాల | 125 |
| 33. | బెంగుళూరు | 500 |
| | 16 స్టాల్స్ హిగ్గిన్ బాదమ్స్ | 675 |
| | స్వదేశమిత్రన్ | 250 |
| | వీలర్స్ | 250 |
| | చందాదార్లు | 2,246 |
| | ఇతర 100 చిన్న ఏజన్సీలు | 3,020 |
| | మొత్తం కాపీలు | **21.746** |

Printed and Published by B.N. REDDI, at B. N. K. Press, 37, Acharappan Street, Madras
Editors: CHAKRAPANI and K. RAJA RAO.



*Chandamama, August '48*

*Photo by V. H. Rao*

వీర బాలుడు



చందమామ సామెతలు – ౨

పిల్లలు పెద్దలకు ముద్దు
చందమామ అందరికీ ముద్దు!

చందమామ కన్నడంలోనూ
అరవంలోనూ కూడా వస్తున్నది

PRINTED AT THE B. N. K. PRESS, 37. ACHARAPPAN ST. MADRAS-1